# పెంపుడు చిలుక

## పద్య ప్రబంధము

'యుగళ సహస్రావధాని'

డా॥ కడిమిళ్ల వరప్రసాద్

# PEMPUDU CHILUKA

Yugala Sahasravadhani,
**Dr. Kadimilla Vara Prasad**
M.A., M.A., Ph.D,

**Copies: 1000**
Published in the Year 2006



**Rs. 80/-**

Copies can be had from :
**Kadimilla Sri Virinchi**
'Hamsavahana' D.No.3-6-50,
YerramilliVari Street,
NARSAPUR - 534 275,
W.G. DIST., A.P.
Tel 08814 - 274876
Cell : 92478 79606

Cover Design,
D.T.P & Printed by :
*Creative Services*
Opp. SBI, Steamer Road,
Narsapur - 534 275
Cell - 9866115113.

## మరువగలనా! వీరిని!!

**శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థస్వామి - శృంగేరి**

**శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానంద భారతీ స్వామి - కుర్తాళం**

**శ్రీశ్రీశ్రీ గాడ్ - వెదురుపాక**

శ్రీ పి.వి. రమణ - సింగపూర్

డా॥ టి.వి. నారాయణరావు - రాజమండ్రి

శ్రీ అజిత్ కుమార్ జైన్ - నర్సాపురం

శ్రీ గొర్తి కామ శాస్త్రి - పాలంగి

శ్రీ కొంపెల్ల సత్యనారాయణ - రాజమండ్రి

శ్రీ కె. కోటారావు - అనకాపల్లి

డా॥ కేశాప్రగడ సత్యనారాయణ - రాజమండ్రి

డా॥ ధూళిపాల మహాదేవమణి - రాజమండ్రి

డా॥ మల్లాప్రగడ శ్రీమన్నారాయణ - పొన్నూరు

శ్రీ జి.వి. హరనాథ్ - హైదరాబాద్

శ్రీ మల్లిన రామచంద్రరావు - తణుకు

డా॥ జి.ఎస్.వి. ప్రసాద్ - తణుకు

శ్రీ సుశర్మ - తణుకు

శ్రీ వడ్డి శ్యామసుందర్ - ఏలూరు



# ఆశీర్వాద శ్రీముఖము



డా॥ కడిమిళ్ల వరప్రసాద కవి ఆంధ్రదేశంలో అవధానిగా సుప్రసిద్ధుడు.అష్ట,శత, సహస్రావధానములలో అత్యంత నిపుణునిగా పేరు చెంది, పద్యవిద్యకు అనుపమాన సేవచేస్తున్న ప్రతిభా విభూషితుడు. భువన విజయాది సాహితీ రూపకములలో వివిధ పాత్రలు నిర్వహిస్తూ సర్వాంగీణ సామర్థ్యముతో సాహితీ సముపాసకుల హృదయాలలో సమున్నత స్థానం సంపాదించుకున్నాడు. నా పూర్వాశ్రమానుబంధంతో కలుపుకుంటే మా సాన్నిహిత్యానికి రజతోత్సవ సమయం దాటింది. కవిగా ఎన్నో గ్రంథాలు రచించిన కడిమిళ్ల కవి ఇటీవల తీర్చిన పద్య ప్రబంధము పెంపుడు చిలుక!

సంస్కృతాంధ్రములలో పశుపక్ష్యాదుల చేత సంభాషణలు చేయిస్తూ కథలు నడిపించడం పరిపాటిగానే ఉన్నది. 'పంచతంత్రము' వంటి గ్రంథములు వీనికి విశిష్టమైన ఉదాహరణములు. ప్రబోధ చంద్రోదయ నాటకం ఒకటి ప్రత్యేకంగా పేర్కొనదగిన గ్రంథము. ఆ మార్గంలో ప్రయాణిస్తూ మానవ జీవితయానంలో వచ్చే వివిధములయిన మజిలీలలోని అనుభవాలను దర్శింపచేస్తూ మైత్రి మమకారాల మాధుర్యపు లోతులను చూపుతూ చేసిన ఈ రచన అత్యంత ప్రశంసాపాత్రమైనది. తన కవితా మార్గాన్ని గురించి చెపుతూ.

ఉ॥ నా వదనమ్ము కావ్య సదనమ్ము, రసమ్మట బాకశాల, స
ద్భావనలే గదుల్, నడులు ద్వారములార్ద్ర గభీర తత్త్వమే
బావి, పవిత్రశాస్త్రముల వాకిట బద్యము రంగవల్లియై
పావనులైన వారలకు స్వాగతముల్ వచియించునెప్పడున్ ॥

అని ఇచ్చిన నిర్వచనం రమణీయంగా విరాజిల్లుతున్నది.

వసంత ఋతువులో మామిడి కొమ్మమీద కలమంత్రపరాయణుడైన కోకిల స్వామి పాటకు పరవశించిన ఒకరసాల వృక్షము, ఋతువు మారగానే కోయిల ఎటో వెళ్ళిపోతే ఆ వియోగాన్ని భరించలేక

బాధపడుతుంది. కాళిదాసీయమైన అజవిలాపాన్ని గుర్తుకు తెచ్చే పద్ధతిలో ఈ ఘట్టం కొనసాగింది. వసంతేతర ఋతువులలో కోకిలకు పాడే శక్తి ఉండదట! కవులకు, గాయకులకు శ్రేష్ఠత్వ సూచకంగా కవికోకిల, గానకోకిల అని బిరుదులిస్తారు. వారి కళాశక్తి అన్ని ఋతువులలోనూ ప్రసరిస్తూనే ఉంటుంది. నాకెందుకు శక్తి పరిమితమైనదని కోకిల బాధపడిందట.

ప॥ కవికి, గాయకునకు గూడగౌరవమ్ము
కోకిలమ్మను బిరుదమ్ము కూడియుంట
యట్టి నాకేల పాక్షికంబాయెశక్తి
వారి - వారికి బ్రదుకెల్ల వఱలుచుండ ॥

ఒక చిలుక ఆ రసాలవేదనను చూచి మనసు కరిగి ఆ అడవిలో కోయిలను వెదికి తెచ్చినది. కోయిల తన బాధను తెలిపి ఒక్క వసంతములో తప్ప తాను ఇతర ఋతువులలో పాడలేనని, అక్కడ నుండి వెళ్లి పోవడానికి వేరే కారణం లేదని తెలియచేసింది. అప్పుడు చిలుక కాలవశాన జరిగే ఇటువంటి మార్పులకు చేర్పులకు బాధపడరాదని ఉన్నదానితో సంతృప్తి పడాలని లేనిదానికోసం తపించినంత మాత్రాన రాదని తాత్త్విక బోధ చేసింది. ఈ బోధలలో పరిణతమయిన అద్వైత సిద్ధాంత విశేషములు చోటు చేసుకున్నవి. వానిని విన్నతరువాత పికము, రసాలము, "ఓ చిలుకా ఇంత శాస్త్రీయ ప్రాభముతో పలకడం సామాన్యులకు సాధ్యము కాదని, నీవు ఎవరో అసామాన్యమయిన జీవిగా ఉన్నావు, నీవు ఎవరో తెలియచేయవలసినది" అని అవి కోరినవి ఆ చిలుక తన జీవిత చరిత్రను చెపుతుంది. ఒక పవిత్ర దేవాలయములో నివాసము అక్కడి దివ్య వాతావరణము,తరువాత ఒక ఆడు చిలుకతో ప్రేమ సుఖ జీవనము ఈ ఘట్టాలన్నీ మానవ జీవితం వలెనే సాగినది. ఒక నాడు దురదృష్టవశాన ఒక బోయవాడు వాటిని వలలో వేసుకుని పట్టి పట్టణము తీసుకుని వెళ్లి అమ్మినాడు. ఒక లలనామణి వాటిని వెల యిచ్చి కొనుక్కొంది. ఆమె ఎంతో ప్రేమతో ఈ శుకి, శుకములను సాకింది. ఆ అమ్మాయి పెండ్లయిన తరువాత తనతోపాటు అత్తవారింటికి తీసుకుని వెళ్లినదట. అక్కడ ఆమె కొన్నాళ్లకు గర్భవతి అయి ఒక బాలికను కన్నది. ఒకసారి గాలివాన వచ్చి ప్రకృతి కల్లోలిత మయినప్పుడు ఒక పాము

వీరింటిలో ప్రవేశించి ఉయ్యాలకు కట్టిన తాడు మీదుగా పైకి వెళ్ళి బిడ్డను కాటువేసే స్థితిలోఉంది. అప్పడే చిలుకలు దానిని తమ ముక్కులతో పొడిచి పాముతో యుద్ధము చేసి బిడ్డను కాపాడినవి. ఆ పోరులో పాము, ఆడుచిలుక మరణించినవి. తమ బిడ్డను కాపాడిన ఆ చిలుకలపై పెంచిన కాంత ఎంతో ప్రేమ, సానుభూతి చూపించినది. తన భార్యావియోగంతో వేదన చెందిన చిలుక ఆమె అనుమతితో దేశ సంచారం చేస్తూ ఈ రసాల ప్రాంతానికి రావడం ఆ వృక్షంతో - కోకిలతో సమాగమం జరిగినవి. ఈలోపు విరహ వ్యధతో నిరాహారియై తిరుగుతూ స్పృహ తప్పిన చిలుకను ఒక యోగి ఆదుకొని - దగ్గరకు తీసి ఆకలి దప్పికలు తీర్చి సద్బోధచేసి పంపాడు. ఆ యోగి వాక్యభావం చిలుకను మరింత తాత్త్వికునిగా మార్చింది. మళ్ళీ తమను పెంచుకున్న కాంత దగ్గరకు చేరి ఆమె పాపతో ఉండటానికి వెళ్తూ త్రోవలో చేసిన పికరసాల స్నేహబోధ - ఈ కార్యంలో ప్రధాన ఘట్టం. ఈ చిలుక పాత్రను నిమిత్తంగా చేసుకొని కవి తన హృదయంలోని వేదాంత భావనను హృద్యపద్యరూపంగాచి త్రీకరించారు. శుకోపదేశమని పేరు భావించటంలోనే వైయాసికీ బ్రహ్మ భావన ద్యోతకమవుతున్నది. ఆనాడు భాగవత రసాలఫలము శుకముఖమునుండి ఏ విధముగా అమృత ద్రవసంయుతమై రసికులకు భావుకులకు అందినదో ఈ కావ్యము కూడా అటులే తాత్త్విక చింతనకు రసాకృతియై భాసిల్లుతున్నది.

ప॥ కడిమిగల యట్టి కడిమిళ్ల కలమునుండి
వెలికి వచ్చిన పెంపుడు చిలుక గాథ
మంచి కైతలనెంచి మన్నించువారి
గుండియల నుండి వెలికి రాకుండుగాక!

అని ఆకాంక్షిస్తున్న కడిమిళ్ల కవి హృదయేచ్ఛ సఫలమవుతుందని భావిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

సద్విద్యానంద
భారతీస్వామి
16/10/06

# ఉపాస్మహే

1. శ్రీరామ ధర్మనిష్ఠా
సారంబాసారమగుచు జగతీ హృత్కే
దారములో బావన సం
స్కారము పండించుగాత కలకాలమ్ముగ్ ॥

2. పెద్దది పొట్ట విద్దియల పెట్టియగా, నిడుపాటి తొండమా
బుద్ధులకెల్లనూపిరియ, పూజ్యుల పల్కులనాలకింపగా
బెద్దవియైన వీనులును, బిన్నలు కన్నులు బాహ్యదృష్టియే
వద్దనుచున్న నొజ్జలగు వాడు గణాధిపుడిచ్చు దీవెనల్ ॥

3. భారతీ దేవి యొసగిన పాలలోని
శక్తి, వేంకట రామయ్య శాస్త్రి ప్రేమ
స్థితిని గల్పించె వారికి సుతుడనగుట
నేను జేసికొన్నట్టి పున్నెముల పంట

4. మొదటి యవకాశమొసగిన పుణ్యమూర్తి
శతవధానిగా నాకు యశమ్ము గూర్చె
భారతీ తీర్థుడా పద పద్మ రజము
నొదలను దాల్చి ధన్యుండనగుదునేను ॥

5. అతిమాత్ర ప్రతిభా సమన్వితుడు దివ్యానంద సంధాయి, సం
తత రాధా చరణారవింద మకరందమ్మాను భృంగమ్ము నం
చిత భవ్యాశు కవిత్వ తత్త్వ మతియౌ సిద్ధేశ్వరానంద భా
రతి పాదాబ్జములన్ ద్విరేఫమునుగా రంజింతునెవ్వేళలన్॥

6. ఏ విజ్ఞానమునందు నిత్యమమృతంబేత్రైనదో! - యా పయిన్
బ్రావృడ్గౌతమిరైయైనదో! పిదప సంద్రంబైనదో! దానినే
రాపూర్యన్వయ వేంకటేశ పదమే ప్రార్థించి, సత్కావ్యభా
షావారాంనిధి ద్రచ్చివైచెద సుధాసారమ్మునార్జించెదన్ ॥

7. నీ నాల్కంగల పాణినీయమది మున్నీరేమొ! - మచ్ఛ్రోత్ర కూ
పానం జిందిన కొన్ని బిందువుల జీవచ్ఛక్తి సాహిత్య భూ
మీనైదాఘము గొంత బాపినది స్వామీ! నమ్ము శ్రీపాదల
క్ష్మీనారాయణ శాస్త్రి వర్య! భవదంఘ్రి ద్వంద్వమున్ మ్రొక్కెదన్ ॥

8. నను నేనొక్క లతాంతం
బనుకొందును, నిన్ను దైవమనుకొందును, దీ
నిని జేర్చుకొన గదే గై
కొని, నీ పాదాల చెంత కోటారాయా! ॥

9. ఏ యెడనేనినే విషయమేని విమర్శనసేసి పల్కనౌ
రా! యిది గొప్ప వక్తృతగదా! యని పారిషదుల్ ప్రశంసలన్
జే యగ, శాస్త్ర కావ్యరససేవన శౌండుడు, రామ సూర్యనా
రాయణ యంత వాడు గురుడౌటకు సాక్ష్యముగా దలంచెదన్.

10 పలికిన దెల్ల బద్యమగు పట్టున బల్కగ వచ్చుగాని యా
పలుకులు కైతలై నిలుచు బట్టులెఱుంగని వాడు సత్కవీ
శుల దరి నిల్వ జాలడను సూనృత వాక్యమెఱుంగ, సోమయా
జులు గద మార్గ దర్శకుడు సూరి వరిష్ఠుడు దేశికార్యుడున్ ॥

11. ఎవరే ప్రశ్నమునెప్పుడేనియునునెందే జేసినన్ వెంబడిన్
సవిమర్శమ్ముగ దాని సంగతులు విస్తారమ్ముగా జెప్పువా
డెవడుండున్ బరమ ప్రమాణముగ రూపింపన్ సమర్థుండు గౌ
రవ సంపన్నుడు నిమ్మగడ్డకుల సుబ్రహ్మణ్యుడే గణ్యుడౌ ॥

12. సంస్కృతాన్నమునకు సంస్కృతి ఘృతమును
గలిపి ముద్దసేసి గారవమున
గోరు ముద్దతీసి కొసరి కొసరి తల్లి
యారగింపజేసె అన్నపూర్ణ ॥

13. కవితా శారద నీదు నాల్కపయి జొక్కన్ గాపురంబుండె, శా
స్త్రవచో లక్ష్మికి నీయెడంద గృహమై రాజిల్లె శిష్యార్థ గౌ
రవ గౌరీయుతమయ్యె నీతనువు, మర్యాదా త్రిమూర్త్యాత్మకా!
యవలంబించితి నేనుపాసనము దేవా! కృష్ణమాచార్యుడా! ॥

14. చెఱువున స్నానమాడుటకు జేరినచో రసలోపమేమి? మా
చెఱువవధాన వేదికకు జేరినచో రసలోపమేమి? యా
చెఱువు నిదాఘకాలమున జిక్కిన జిక్కగ వచ్చుగాని మా
చెఱువునకెన్నడేని రస సిద్ధికి లోటను మాటగల్గనే? ॥

15. వ్యాకరణ శాస్త్ర వారాశియందు మునిగి
తద్ధితానర్ఘ రత్న సంతానమెల్ల
జేదుకొని, కోరి, వితరణ చేయుచుండు
నతడు కొంపెల్ల సత్యనారాయణుండు ॥

16. లీలగనొక్క శాస్త్రమున రేవెలుగై కనుపట్టుటన్న ని
క్కాలమునందసాధ్యముగ గన్పడుచుండగ బూని నాల్గుశా
స్త్రాలను బుక్కిటం బొదువు దక్షత కల్గిన విశ్వనాథ గో
పాలుని పాదముల్ పొదివి పట్టుట మెట్టుట సత్యలోకమున్ ॥

17. కేసాపెగ్గడ వంశవార్ధి శశివై గీశ్శక్తి యుక్తుండవై
రాశీ భూతము సంస్కృతాంధ్ర కవితా రాజ్యమ్ము పాలించుచున్
వాసిన్ గాంచు వధానివై, సుకవివై, వక్తృత్వ కాణాచివై
యాసాంతమ్ము యశమ్ముగాంచితివి యన్నా! సత్యనారాయణా ॥

18. వెన్నెల వానలు నగవులు
వన్నెలకే వన్నెదిద్దు బలుకులు, కయితల్
దొన్నెలతో తేనెలు శ్రీ
మన్నారాయణుడ! నతులు మల్లాప్రగడా! ॥





## వైద్యో నారాయణః



నానాగ్రంథములన్ బఠించుటయొ! విజ్ఞానమ్ము నార్జించుటో!
ప్రాణమ్ముల్ నిలబెట్టు వైద్యమున రారాజై ప్రవర్తించుటో!
జ్ఞాని వ్రాతము గొల్చుటో! కవులమెచ్చన్ వచ్చుటో! యౌర! టీ
వీ నారాయణరావు కన్న ఘనుడీ విశ్వమ్మునన్ దోచునే! ॥




ఆతడజిత్ కుమారుడు మహామహితాత్ముడు మందహాసమే
వాతెరయందు నిల్చు, జనబాంధవుడాతత సంఘసేవనో
ద్యోతిత కీర్తిమంతుడు, కళోర్వికి దానొక జీవగఱ్ఱ, వి
ఖ్యాతుడు స్వర్ణవర్తకుడు కాంచనచిత్తుడు స్నేహపాత్రుడున్ ॥

# శిష్య విభూతి

1. పోచనపెద్దియే మొదట పూచిన పూవటుపైని కోటయున్
బూచెను, వద్దిపర్తియును బూచె బయిన్ మరడాన పూచె దా
బూచెను మంకునాపయిని బూచెనుగా గొలకోటి మున్ను నా
నోచిన నోములన్నియు ననున్ గురు హాలికు జేసె ధన్యుడన్

2. నేను దపమ్ము చేసిన మనీషిని పూర్వ భవమ్మునందటుల్
కానిదె సాహితీ పటిమ కల్గునె! యీ యవధానమబ్బునే!
తేనెలు వానలై కురియు దీరున గైతలు పల్కు 'కోట ల
క్ష్మీనరసింహ' మంతటి విశిష్టుడు శిష్యుడుగా లభించునే! ॥

3. అట్టిటు బల్కరాని హృదయంగమ శిష్య గుణాభిరాముడే
పట్టున బల్కినట్టి ప్రతి పద్యము హృద్య మరంద ధారయే
తట్టును గుండెలోతులు సుతారముగా నవధానవాణికే
పెట్టనికోట 'కోట' ప్రభవించెను నాకొఱకే నిజమ్ముగన్ ॥

4. శిష్యుడై చేరి, మిత్రుడై చెలగినాడు
జంటకవియయ్యె గైతల పంటయయ్యె
అష్టశత సహస్రాది హృద్యావధాన
హాటకమునకు బెట్టని కోటయయ్యె ॥

5. కలసి కవిత్వమున్ బలుకు గాలమునందునె గాక యూరకే
యలిబిలి మాటలాడు సమయంబున మా యనుబంధ వైఖరీ
బలమునుగాంచి, యీర్ష్యపడు వారెవరో యననేల మాదు భా
ర్యలును నపూర్వమైనదిగదా! యిది ప్రాక్తన బంధమే గదా!

6. కడిమిళ్ళ కోట కవులము
వడిగా బద్యములు పల్కు బట్టున నుడులే
జడులై జడమతులేనియు
దడిసిన గుండియలతోడ దనివోవ వలెన్ ॥

7. పలికేడి వేగమందుకొని వ్రాయును ముత్యములేర్చికూర్చిన
ట్టులు పది నూరులైనను, బటు ప్రతిభామతి మస్తకంబునన్
నిలుపును మొత్తమన్నియును, నిష్కలుషంబగు భక్తి భావమే
తలపుల యందు బండు వనితామణి 'సత్య' కుసాటి కల్గునే! ॥

8. సత్యాచేతము కడిగిన
ముత్యమ్మే తత్ 'ప్రకాశ' మూలము విభుడే
యత్యంత సాన్నిహిత్యా
న్నాత్యము గలయట్టి జంట నవ ముకురమ్మే ॥

9. తిక్కనకుం గురునాథుడు
దక్కినటులు నాకు 'సత్య' తారసపడె, నా
యక్కరములకున్ వెలుగులు
దక్కినవా ఋణము దీర్చు దక్షత గలదే! ॥



## ఆది గురువు

1. ననుగన్న తండ్రి, నన్నే
మనమెల్లను నింపుకొన్న మాన్యుండాశీ
స్స్వనమొందు దక్క, పరుష
ధ్వనియన్నది వాని నోట వచ్చుట యెఱుగన్ ॥

2. కనుగవయందు నెన్నడును గన్పడరాదొక యెఱ్ఱజీర, ని
ర్ధనతకృశింపజేసినను ధర్మము తప్పిన జాడలేదు, మ
జ్జనకు గభీరతాస్థితికి సాటికి వచ్చునె సంద్రమేని య
వ్వినయుడు ప్రేమ జీవనుడు **వేంకటరామయశాస్త్రి** మౌనియే ॥

3. అట్టి నా కన్న తండ్రికి నంకితముగ
బలుకుచున్నాడ బెంపుడు చిలుక కృతిని
వానియాశీర్వచశ్శక్తి వైభవమున
చిలుక జగమెల్ల విహరింప గలుగుగాత ॥

# సుహృద్విభూతి

1. అప్పటికప్పుడేవిషమైన ననర్గళధార తోడుగా
జెప్పగలట్టిదిట్ట, విరచించుగవిత్వము తేనె వాకయై
చొప్పడునట్లు స్నేహ గుణసూరి రసజ్ఞ మనోవిహారి **'ర
డ్డప్ప ధవేజి'** కంటె ఘనుడైన మనీషి యొకండు గల్గునే! ॥

2. **అతడచ్యుతరామారా**
వతనికి గలభక్తి కొలువనగునా నాకున్
సతి వాణి, సుతుడు, సుతయును
నతనికి దగినట్టివారె యమృత హృదయులే ॥



# సింహపురి పారిజాతం

ఆతిథేయితకు భాష్యమ్ము పల్కినయట్టి
అన్నపూర్ణా రాణి యమృతమూర్తి
తనకు దోడైయుండ దానశీలము పండి
వేంకటరమణుండు వినుతిగాంచె
సంగీత సాహిత్య సంస్కృతిన్ మెచ్చి, భూ
షించుచున్ సతము పోషించుచుండె
గోదావరికి దూర్పు కోనలో బ్రభవించి,
జగమెల్ల దనదిగా సాగుచుండె
పేరి వంశ వారాశికే సౌరునించి
వెలుగులీనుచునున్నట్టి చలివెలుంగు
నిత్య శుక్ల పక్షమ్ముతో నెగడు గాత ॥
సార్వ కాలికమైన ప్రశస్తితోడ ॥

బండారు లంక పురికే
పండుగయై పుట్టినట్టివాడు, వితరణో
ద్దండుడు వేంకట రమణుం
డండగదా! కవి జనాళికవధానులకున్ ॥

సృష్టిచేసెడి వేళలో జిత్తమందు
నే పరధ్యానమొదవెనో యేమొ గాని
'పేరి' వేంకటరమణుని విషయమందు
చేతికెముకను జేర్చుట ధాత మఱచె॥



కడిమిళ్ళను సత్కరిస్తున్న నాటి ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ నారా చంద్రబాబునాయుడు



కడిమిళ్ళను పత్కరిస్తున్న నటసమ్రాట్ శ్రీ అక్కినేవి నాగేశ్వరరావు



కడిమిళ్ళను సత్కరిస్తున్న జ్ఞానపీఠి డా॥ సి. నారాయణరెడ్డి



సహస్రావధానం చేసి  సకళత్రంగా సత్కరింపబడిన కడిమిళ్ళ-కోట కవులు

# ప్రవర

1. జడమతులు గారు శ్రుతులం
దుడుపతులే, యెదిరి నిల్చునుగ్రుని తలపై
తడబడక నిలుచువారే
కడిమిళ్ళాన్వయమునందు గవినాద్యుడనే ॥

2. నేను వరప్రసాదుడను నిక్కము భారతి తల్లి నాకు వి
జ్ఞానులు నాకు దేశికులు సాహితియే హితమైనయట్టి వా
రే ననుగూడు మిత్రులునదేగద నన్ను మహావధాన మా
ర్గాన గమింపజేసె నవురా! జనికెంతటి భాగ్యమోగదా! ॥

3. తాతకు లేదు కవిత్వము
నా తండ్రికి గూడ లేదు నాకే యబ్బెన్
నాతోడనె యాగదులే
నా తనయులకిప్పుడిపుడె నాటుచునుండెన్ ॥

4. భగవంతుండు కుటుంబ భారమును నాపై దండిగా నిల్పినన్
వగపున్ బొందక నెట్టగల్గితిని దద్భారమ్ము మొత్తమ్మునా
సగమౌటన్ సగపాలు పంచుకొనుటన్ జాయా శిరోరత్నమై
నగమై నన్నునలంకరించినది ప్రాణ ప్రఖ్య **మీనాక్షియే!** ॥

# అనగనగా.....

ఒక మామిడిచెట్టు. దానిపై ఒక కోయిల. ఆ రెండిటి మధ్య చక్కని స్నేహబంధం. తన చిగురులతో కోకిలకు తృప్తినిస్తుంది రసాలం. కమ్మని గానంతో ఆ తరువును పులకింప జేస్తుంది కోయిల. వసంతకాలం వస్తే ఇద్దరికీ పండుగే. వచ్చిన వసంతం చెప్పకుండా వెళ్ళి పోయింది. కోయిల గొంతు మూగ బోయింది. పాటల పూలమ్మినచోట జీర గొంతుతో కట్టెలమ్మలేక ఆ చెట్టును విడిచిపెట్టి ఎక్కడికో వెళ్ళిపోయింది. మిత్ర వియోగాన్ని భరింపలేక రసాలం ఎంతో వేదన పడింది. ఆ కొమ్మ పై వ్రాలిన ఒక చిలుక చెట్టు పడుతున్న వేదన గమనించి, కష్టపడి కోయిలను వెదకి పట్టుకొని, విషయం చెప్పి, తిరిగి తీసికొని వచ్చింది.

తనకు తరువుపై స్నేహబంధం తగ్గిపోయి, వెళ్ళిపోలేదని, ఏటికి రెండు నెలలు కమ్మగా పాడే తన గళం మిగిలిన సమయంలో మూగబోవడం భరించలేక సార్వకాలిక గళమాధుర్యాన్ని సంపాదించేందుకు తపస్సు చేసేందుకై అడవికి వెళ్ళినట్లు చెపుతుంది కోయిల. ఆ మాటలకు చిలుక నవ్వుతుంది. ఎందుకు నవ్వుతున్నావని అడుగుతుంది కోయిల. ఏటికి రెండు మాసాలే పాడగలుగుతున్నందుకు నీవింత బాధపడితే అసలు పాడలేని ప్రాణులెన్నో లోకంలో ఉన్నాయి. వాటి సంగతి ఏమిటి? వాటితో పోలిస్తే నీ జన్మ భాగ్య వంతమే కదా! లోకంలో లేని వాళ్ళు లేదని బాధపడతారు. ఉన్నవాళ్ళు మరింత లేదని బాధపడతారు. నీవుకూడా ఆ కోవలోనే ఉన్నందుకు నవ్వు వచ్చిందంటూ వేదాంత సారాన్ని బోధిస్తుంది చిలుక.

ఒక సామాన్యమైన చిలుక ఇంత వేదాంతాన్ని పలుకుట ఆశ్చర్యం కలిగించి, తానెవరో! తన కథ ఏమిటో! చెప్పమంటుంది కోయిల. స్వీయ కథను చెపుతుంది చిలుక.

ఒక ఊళ్ళో రామాలయం. ఆ గుడి గోపురంలో నివసిస్తూండేది ఒక చిలుక. వచ్చి పోయే భక్తుల అందచందాలు గమనిస్తూ భక్తితో వారు పాడే పాటలు వింటూ, వారిచ్చే ప్రసాదాలు తింటూ హాయిగా గడిపేది. కొన్నాళ్ళకు అక్కడకు ఒక పెంటి చిలుక చేరింది. ఆ రెండిటి పరిచయం స్నేహంగా మారి క్రమంగా ప్రేమగా పరిణమించింది. చాల కాలం ఆనందంగా గడిచింది. కోరికలు పెరిగాయి. గుడి భక్తికే కాని రక్తికి పనికిరాదని భావించి, అక్కడినుండి ఒక అందమైన తోటలోకి వలస వెళ్ళిపోయాయి. అక్కడి చెట్లు, లతలు, పువ్వులు, వచ్చిపోయే జంటలు, వారి సరసాలు కన్నుల పండువై ఎంతో రసానందాన్ని అనుభవించింది ఆ చిలుక జంట. కొంతకాలానికి అదికూడా మొగం మొత్తింది. పరిమిత వైశాల్యం గలతోటలోనే ఇంత ఆనందం దక్కితే అపరిమితమైన అరణ్యం ఇంకెంత బాగుంటుందో అనిపించింది. తక్షణం రెక్కలకు పని చెప్పాయి. ఒక మహారణ్యంలో ప్రవేశించి, ఎంతో ఆనందాన్ని అనుభవించాయి. కాని, ఆ ఆనందం ఎంతోకాలం నిలబడలేదు. ఒక వేటగాని బారికి చిక్కాయి. ఆ వేటగాడు వలవేసి పట్టి నగరానికి తీసుకుపోయి అమ్మకం పెట్టాడు. ఒకపడుచుపిల్ల ఆ జంటను కొని, ఇంటికి తీసుకువెళ్ళి పంజరంలో పెట్టి ప్రేమగా చూసుకో సాగింది.

స్వేచ్ఛ బంధనంగా మారినా, ఆ ఇంటి ప్రేమానురాగాలకు వశమై పోయిన ఆ జంట పంజరం వదిలినా బయటకు పోలేదు. ఇల్లంతా తిరుగుతూ హాయిగా స్వేచ్ఛగా కాలం గడుపుతున్నాయి. అంతలో ఆ అమ్మాయికి వివాహం జరిగింది. సారెతో బాటుగా చిలుకలను కాడా అత్తవారింటికి తీసికొని

వెళ్ళింది. అక్కడ కూడా ఆ జంటకు గొప్ప ఆదరణ లభించింది. కొంత కాలానికి ఆ ఇంట ఒక చంటి పాప ఉదయించింది. అప్పటినుండి చిలుకలకు పాపయే సర్వస్వంగా నడిచింది కాలం. అందునా పెంటి చిలుకకు ప్రాణాలన్నీ పాపాయిపైనే.

ఒకనాడు రాత్రి అందరూ హాయిగా నిద్ర పోతున్నారు. ఆకస్మికంగా గాలివాన ప్రారంభమయింది. చెట్లుకూలాయి. పుట్టలపై పడ్డాయి. పాములు చెల్లా చెదరై కనబడిన కలుగుల్లో దూరి తలదాచుకొన్నాయి. కలుగు దొరకని ఒక నల్లత్రాచు ఆ ఇంట్లో దూరి చంటిబిడ్డ హాయిగా పవ్వళించిన ఊయెల తొట్టెపైకి చేరి ఒక త్రాడును చుట్టబెట్టుకొని ఉంది.

అర్థరాత్రి అందరూ ఆదమరిచి నిదుర పోతున్నారు. ఎవరూ గమనించలేదు గాని ఊయెల త్రాటిని చుట్టుకొన్న త్రాచును పెంటి చిలుక గమనించింది. మగచిలుకను నిదుర లేపింది. రెండూ కలసి ఒడుపుగా పాము మెడపట్టి క్రింద పడగొట్టాయి. వాటి మధ్య భయంకర పోరాటం జరిగింది. పాము తోకతో కొరడాతో కొట్టినట్లుగా కొడుతున్నా, భరించాయిగాని దాని గొంతు పట్టు మాత్రం విడిచిపెట్టలేదు. రక్తం కారి-కారి చివరకు పాము చనిపోయింది. తోక దెబ్బల తాకిడికి తట్టుకోలేక పెంటి చిలుకకూడ ప్రాణాలు విడిచిపెట్టింది. పసిబిడ్డను కాపాడుటకు ప్రాణత్యాగం చేసిన పెంపుడు చిలుక వారి ఇలువేలుపుగా మారింది.

చెలియ లేని చోట తానుండలేనంటుంది మగ చిలుక. తన బిడ్డలోనే చెలియను చూసుకొంటూ ఉండమని, విడిచి వెళ్ళవద్దని బిడ్డ తల్లి బ్రతిమిలాడుతుంది. దానికి అంగీకరిస్తూనే ఒక్కమారు తాను, తన చెలి విహరించిన ప్రదేశాలను చూచి వస్తానని బయలుదేరి, తినకుండగా,

త్రాగకుండగా ఎగురుతూ గత స్మృతులకు ఆలవాలమైన ప్రదేశాలన్నీ తిరిగి-తిరిగి సొమ్మసిల్లి పడిపోయిందొక అడవిలో ఆ చిలుక. అపుడొక యోగి పుంగవుడు చూచి, దానిని చేరదీసి, పరిచర్యలు చేసి, బ్రతికించి, త్యాగము చేసిన చిలుక ధన్యజీవి. బెంగపెట్టుకొని, తిండిమాని మరణిస్తే ఆత్మహననమే తప్ప త్యాగము కాదని చెప్పి, వైరాగ్యాన్ని బోధించి తిరిగి ఆ పసిబిడ్డ దగ్గరకే పోయి శేష జీవితాన్ని ఆనందంగా గడుపమని పంపించాడు. ఆ చిలుకే యిది. తనకథ వివరించి, ప్రయాణమధ్యంలో విశ్రాంతిగా మామిడి చెట్టుపై వ్రాలుట, చెట్టు వేదన గమనించి కోయిలను వెదకి పట్టుకొని తీసికొని వచ్చుట జరిగిందని, ఆ యోగి తనకు బోధించిన వేదాంత సారాన్నే తానుకూడా బోధించుట జరిగిందని చెప్పి వీడుకోలు తీసుకొని నింగికి ఎగిరి వెళ్ళిపోతుంది. అంతలో వసంతం తిరిగి వస్తుంది, మామిడి చెట్టు క్రొత్త చిగురులు తొడుగుతుంది. కోయిలకు తిరిగి తన మధుర కంఠం వస్తుంది. మంగళ గళంతో మధురంగా గీతాలాపన చేస్తుంది. కావ్యం పరిసమాప్తమవుతుంది.

తెలి మబ్బులలో బచ్చని
చిలుకయునా యెఱ్ఱముక్కు జెలగు త్రివర్ణం
బులతో భారత దేశో
జ్జ్వల కీర్తి పతాక నింగిపైనెగురునటుల్ ॥



# శ్రీ వసంతము

1. శ్రీమహితము వాసంతము
   రామారామములయందు రక్తుల్ భక్తుల్
   కాములు, గైవల్య పురో
   గాములునై పరవశించు గాలంబదియే ॥

2. వాసంతము కవితా సం
   వాసమునకు వాసియంచు భావింత్రు కవుల్
   వాసంతము వనితా సం
   వాసమునకు వాసియంచు భావింత్రు యువల్ ॥

3. కవన సరస్వతీ చరణ కంజ మధు వ్రతమై చరించుటన్
   గవియు; లతాంగనా వదన కంజ మధు వ్రతమై చరించుటన్
   యువయు; మనోహర ప్రకృతి యూయెలగా, మధురోహలెల్ల ర
   జ్జువులుగనూగుచుందురు రుచుల్ వెలయించి వసంతమందునన్ ॥

4. మనసున మారుమూలల ఘుమం-ఘుమలాడెడి ప్రేమ భావ సం
   జనిత పరీమళమ్ములకు స్పష్టత కల్గి, ధరిత్రి నూత్న యౌ
   వనవతియైనటుల్ పిక రవమ్ములతో మధురోహవైభవ
   మ్మును బ్రకటించునట్లు రస మోహనయౌను వసంత హేలలన్ ॥

5. మానసవీథియందు నసమాన యశః పరిపూత దేహుయై
ధ్యానము చేయుచున్న కవితా వనితా గళసీమయందు స
మ్మాన పురస్కృతిన్ గుసుమ మాలలలంకృతి సేయునట్టులు
ద్యాన వనమ్ములన్నియు లతాంతములన్ బ్రసవించు నామనిన్ ॥

6. లలనలకున్, లతికలకున్
దలపులు, విరులుద్భవించి, ధరణికి గ్రొత్తల్
చెలువులు, క్రొందావులు గా
న్కలుగానిడుటల్ వసంతకాల మహిమయే ॥

7. అమ్ములు పూలు, విల్లు చెఱకాపయి దుమ్మెదలల్లెత్రాడు, మొ
త్తమ్మును జుట్టిరా జిలుక తత్తడి, చల్లని పిల్లగాలి నే
స్తమ్మతడెంతపాటి యని జవ్వనులా వలరాజుతోడ గ
య్యమ్మొనరింతురామనులయందున జూపుల తూపులేయుచున్ ॥

8. చిలుకల పలుకులు, లలనల
కులుకులు, తుమ్మెదల రొదలు, కోయిల పాటల్
వలరాజు చెఱకు వింటికి
గలుములనిడునీ వసంత కాలమ్మెగదా! ॥

9. రసనాగ్రమ్మున 'రామ-రామ' యను మంత్రధ్యాన సంరంభమే
యసమానామృత సౌరభమ్మొసగు రామారామ దేశమ్మునన్
రసనాగ్రమ్మున 'రామ-రామ' యను మంత్ర ధ్యాన సంరంభమే
యసమానాస్త్ర పరీమళమ్మొసగు రామారామ దేశమ్మునన్ ॥

10 ముద్దు-ముద్దుగా దాగుడు-మూతలాడు
గరిత జాడను బసిగట్టగలడు ప్రియుడు
సిగను దుఱిమిన మల్లియ చెండులోని
తావినెవ్వారికేనియు దాచదరమె! ॥

11. కమ్మని నెత్తావుల సా
రమ్ములు మధుమాస వాసరమ్ములు కుసుమా
స్త్రమ్ములకభ్యుదయారం
భమ్ములు యువలోక వైభవమ్ముల సొమ్ముల్ ॥

12. ఎండయు, వానయున్, జలియునేచని చక్కని కాలమౌటచే
బండువగా వసంతమును బ్రాణిచయమ్ము దలంచుచుండు, నీ
రెండకు గందిపోవు దరళేక్షణకున్ మదానగ్ని నేరుగా
గుండియయందు డాగియునకుంఠితమై వెలుగొందునందముల్ ॥

13. ఏటికొకమారు వాసంతమెసగుచుండు
రెండు మాసముల్ మాత్రమే పండుచుండు
బండ గుండె యయ్యునునయః పిండమేని
బైడిగా మార్చగల్గిన పరుసవేది ॥

14. కోయిల గున్నమావి కడకొమ్మన నిల్చి, కుహూరుతంబులన్
హాయిగ జేసి, లోకులకునామెతలన్ గయిసేయు గొంతులో
దీయని తేనె వాక నినదించుచు బొంగుచు దన్మఖోద్గతం
బై యలరారి, కర్ణ కుహరాంబుధిలో లయమొందుచున్నటుల్ ॥

15. మధు మాసోద్భవ కోకిలా గళ మహామాధుర్య మందాకినీ
సుధలన్ గ్రోలెడి వీను ధన్యమగుచున్ శోభిల్లునానంద నీ
రధి వీచీ రస డోలికాంచల మనో లాస్యమ్మవశ్యమ్ము పె
న్నిధియై నిల్చును బంచసూన జగతీ నీరాజనంబిచ్చుచున్ ॥

16. కోయిల గాత్రమందు సమకూరును దీపి రసాల వృక్షమా
ప్యాయతతో బ్రవాళములనామెతగా గయిసేయ, బాటలో
దీయదనంబు జీర్ణయయి, త్రేన్చి, యదే రసవత్ ఫలమ్ముగా
జేయుచు విందొసంగు రససిద్ధి గదా! సహకార తత్త్వమున్ ॥

17. అది యన్యోన్య సమాశ్రయమ్మయిన స్నేహ వ్యాసపీఠమ్ము స
మ్ముదమిచ్చున్ మన నోటికిన్, జెవికి, సంపూర్ణాయురారోగ్య సం
పదలందించుచు సార్వకాలికముగా వర్ధిల్లి, యవ్యాజమై
గదియున్ మైత్రి, నిమిత్త కారణములై కన్పట్టు సంఘట్టనల్ ॥

18. కమ్మని యా కోయిల నిన
దమ్మనకు రసాల తరువు తనిసెను గానీ!
యమ్మధురిమ కించిత్ భో
గమ్మై గ్రీష్మమ్మునందు గరిగెన్ దటిగెన్ ॥

19. తన చిగురుం గొమ్మలపై
మొన చివురులు మెసవి గానమును మొదలిడుచున్
దనియించెడి గోయిల గొం
తునకేలనొ! మూగతనపు దొసగు జనించెన్ ॥

20. మాటదక్క యొక్క పాటపాడగ గొంతు
సహకరింపకునికి జాల గుమిలె
గళకు దూరమౌట క్షణకాలమేనియు
నిలువలేక పికము తొలగిపోయె ॥

21. గొంతు వినగరాక, కోయిల గనరాక
తరువు క్రుంగె గుండె బరువుతోడ
గనులు కాయలయ్యె గన్నీరు రసమయ్యె
నెలుగునెత్తి-యెత్తి పిలిచెనిట్లు ॥

**రసాల విలాపము :**

22. ఏమైపోయితె పికమా!
నా మాటను మఱచిపోయి, ననువిడనాడన్
నీ మానసమెటులొప్పిన
దే! మఱి-మఱి కరగుచుండెనే గుండియయున్ ॥

23. ఎందుకు నీకు-నాకు జనియించినదోగద స్నేహబంధమెం
దెందు జరించినన్ దిరిగి యిచ్చటికే యరుదెంతువంచు, నా
యందున నీకు గల్గిన సమాదర భావము శాశ్వతత్వమున్
బొందునటంచు నేను దలపోసితి గాసిలుచుంటినిచ్చటన్ ॥

24. నీ యొడలెల్ల బాట యగునే గద! నా యొడలెల్ల బాటకున్
బ్రాయమునిచ్చు చుండుగద! ప్రాయము గల్గిన పాటయే గదా
హాయినొసంగు గుండియకునాక్షణమున్ మదివిస్మరించి, నీ
వేయెడకేగినావొ! కనిపింపవుగా! వినిపింపవేగదా! ॥

25. నేనేదక్క మఱొక్క భూమిజము లేనేలేదు నీచిత్తమం
దౌనా! నేనె సమస్తమై నిలువగానానంద ధామమ్ముగా
నానీడన్ దలపోసియుంటివి గదే! నా నీడలో బాటకున్
బ్రాణంబుండునటంచు బల్కితిగదే! యాబాసలేమాయెనే! ॥

26. "నీ నీడను మనగలుగుట
యానందము కలుగుచుండుననవరతమ్మున్
నీ నీడయె యీజన్మకు
గానుక" యనుటెల్ల గల్లగా మారినదే! ॥

27. గాలి రవంత వీచిన సుఖమ్ముగనూయెలలూగి, గాలిలో
దేలితివీవు, నా యొడిని దేవళమంచు దలంచినావు, రా
గాలను వించినావు, మమకారముతో మురిపించినావు, నా
పాలిటి దైవమీవనుచు బల్కిన పల్కులు కల్లలాయెనే! ॥

28. "నీ చివురాకులన్ మెసవి నేర్చిన గానము నా యెడందలో
బూచిన పూవు నీచరణముల్ స్పృశియించి, రహించి పోవుటే
నోచిన నోములన్నియు నను గని ప్రోచుట" యంటివీవు గా
నీ! చెలికారమున్ విడచి నేడెట కేగితివే పికోత్తమా! ॥

29. నా కంటెరసానందము
సాకల్యముగానొసంగ జాలిన నేస్తం
బేకడనేని లభించెనె!
నాకూరిమి చేదు గుఱుతునా విడచితివే! ॥

30 సరియేలెమ్ము త్వదీయ మానసము నిచ్చల్ మోదవారాశిలో
తరగల్ తూగుటుయేలలై మురియుటే తాత్పర్యమైయుంటి, సం
బరమున్ బొందుచు గ్రొత్త తోట యొడిలో-బ్రాయింటినిం జిన్నగా
స్మరియింపం గలవేని జాలునదియే సౌభాగ్యమంచెంచెదన్ ॥

31. అయిననుబిచ్చిగాని, గుఱుతన్నది నీకు రవంత లేదు ని
శ్చయమటులుండెనేని బలుకాడుటకున్ వెనుకాడనేల! నా
పయి మమకారమున్ దుడిచివైచి మరొక్క ప్రదేశమందునన్
హొయలొలికించుచుంటివి గదోయి! గతమ్మిక గుఱ్తు వచ్చునే! ॥

32. వాతెర విప్పుచో బలుకు బట్టులలో ననుగూర్చి దక్క వే
రే తలపన్నదే గనక 'యెంతటి భాగ్యము నాద'టంచు నే
నే తనివోయితిన్, బరవశించెడి నీ కనుదోయి కాంతిరే
ఖా తరుణేందు చంద్రికల గాంచి, రహించి, తరించి పోయితిన్ ॥

33. పలుకుం దీరులు మారజొచ్చినవి, యాపై దగ్గుచున్ వచ్చెనెం
దులకో నేను గ్రహించుకోనయితి, నిన్నున్ మెచ్చి, నీ పాటకున్
దల పంకించి, రసోచితమ్ములగు జేతల్ చూపి నీచిత్తమున్
బలిమిన్ బట్టిన దేశమెయ్యది? సుఖంబా! నీకునందేనియున్ ॥

34. కానిమ్మెచ్చట నీకు సౌఖ్యమగునో! కామ్యంబులీడేఱునో!
యా నీడన్ వసియింపగోరునెడ నాకభ్యంతరమ్ముండునే!
కానీ! నా గనుగప్పి పోవుటయె దుఃఖంబాయెనే! నాకు నీ
పైనిన్ గోపము లేదు నమ్ముము పికంబా! సత్యమున్ బల్కెదన్ ॥

35. నను విడనాడి పోయిన క్షణంబు దవానలమై దహించు నా
మనమును మాటి మాటికిని; మాటయు-మంతియుగూడ లేకపో
యినది, మహాపరాధమొనరించితినా! నినుగూర్చి యెప్పుడై
నను, మదిదర్పణమ్ము దగునా! యిటు ముక్కలుసేసి పోవగా! ॥

36. నీకున్ సేమమటన్న వార్తయగదా! నే గోరితిన్, గాలితో
నాకావార్తను బంపవచ్చును గదా! నాతోడ మాటాడుటే
నీకున్ నచ్చక పోయెనో! తలపులేనిన్ నీకు రాకున్నవే
యీ కార్కశ్యము నీకెటుల్ కలిగెనే! యేమందునే కోయిలా! ॥

37. నన్నుంగూర్చి తలంపు లేక యెటులానందంబుగానుంటివో!
యెన్నాళ్ళైనది నిన్ను జూచియని చింతింపన్ దివా-రాత్రముల్
కన్నుల్ కాయలు కాచి, పండినవి నీకై నా నిరీక్షించుటన్
మూన్నాళ్ళుండిన రాలిపోవునిక నీ మోమైన చూపింపవే! ॥

38. లేత ఱెక్కల పక్కి వై లీల దోడ
నాదు గుబురుల డాగి యానందమంది
ఱెక్క ముదిరిననాడు వేరొక్క దరికి
జేరిపోయితివిది యెంత చిత్రమైత్రి ॥

39. ముందు బుట్టిన చెవులు పసందు కావు
వెనుక వచ్చిన కొమ్ములే మొనలు దేరు
నాది మైత్రికి గల్గె దిలోదకములు
జాతకర్మముత్తరమైత్రి జరుపుకొనియె ॥

40. కన్నులు కానరాని యొక గాఢ నిశీథమునందు నీవు గై
కొన్న తలంగడన్ దలచుకొమ్ము, మదీయమురమ్ము నేటికిన్
జిన్నెలు దాల్చియున్నది విచిత్ర పురాకృత సత్కృతిత్వ సం
పన్నము నాటి భాగ్యమని భావన సేయుచునుందు నేటికిన్ ॥

41. నను విడనాడి నీవు చనినన్ మదిలోగల తీయనైన భా
వనలను, జ్ఞాపకమ్ములను బట్టుక పోగలవే! రసాభి షే
చనములు సల్పి, దాచుకొనజాలుదునయ్యది చాలు నాకు, నా
కనులను నీకు గాపురము కల్గినటుల్ దలపోయుచుండెదన్ ॥

42. నిను నేనెఱుగని వేళల
గొనకొని నాదరికి వచ్చి, కూర్మిని బ్రచరిం
చిన సంగతి గుఱుతున్నదె!
మనమున బూర్వానుభవము మఱుగుంబడునే! ॥

43. వచ్చితివేల నాదరికి, వచ్చిన దానవు వచ్చినట్లె పో
వచ్చునె, యట్లుగాక నినువంటి మహీజము లేదటంచు నన్
మెచ్చితివేల? మెచ్చినను మెచ్చగ వచ్చును గాని నాయెడన్
మచ్చిక చూపితేల? యిటు మాయను గ్రమ్మి యదృశ్యమైతివే! ॥

44. ప్రాణంబిచ్చినయట్లు పల్కితివి సర్వస్వంబు నీవంచు వా
గ్దానంబుల్ పొనరించి, నాయెడల జేతఃప్రీతి చూపించి, నా
లోనన్ నూత్న రస ప్రచోదన కళా లోలామతిన్ నిల్పి, డెం
దానన్ గూటిని గట్టుకొంటివి గదే! తల్లీలలేమాయెనే! ॥

45. నాజీవన కావ్యమ్మున
నీ జత రససిద్ధియనుచు నేనెంచెతినే
యే జగడము లేకుండగ
పోజెల్లునె! పుటలు చిరిగె బోడిమి తటిగెన్ ॥

46. గుండియలో మకరందము
పండించినదానవీవు బాపురె! నీవం
దుండమి యది హాలాహల
భాండమ్మై సెగల-పొగల బారిన పడియెన్ ॥

47. నాదానవు నీవనుకొని
సాదరమున జేరదీసి, స్వాంతమునందున్
మోదమ్ము నింపుకొంటిని
కాదనుచున్ గాలదన్నగా న్యాయమటే! ॥

48. కాదను నుద్దేశ్యమ్మే
యాదిని నీకుండెనేనినసలెందుకు నీ
వీదరి జేరుట, మూన్నా
ళ్ళాదరమును జూపి పిదపనవలంజనుటల్ ॥

49. తీయని బంధమంచు విడదీయగరాని రసానుబంధ వి
ద్యాయుత జీవనామృత విధాన నిదానమటంచు గుండె కా
ప్యాయన మంత్రమున్ గఱపునట్టి మనోహర మైత్రి యంచునా
మ్నాయ నిభమ్ము లైన పలుమాటలతేటలు నీటి-మూటలా! ॥

50. నీటిని మూటగట్టగల నేర్పుఘటిల్లెను నీకుగాని, యా
నీటను స్నానమాడగల నేర్పు రవంతయు నాకులేదు, ప
న్నీటిని నీకొసంగితిని నీవిట జిచ్చు రగిల్చి పోయితీ
పూటకు నీకు-నాకు ఋణముల్ సరిపోయెనొ! చీలిపోయెనో! ॥

51. ఋణములు తీరిపోవునవి ప్రేమలుగావు మదీయ పత్ర తో
రణములు స్నేహబంధము విరాజిలునట్టులలంకరించి, భూ
షణములుగా మదీయ సుమ సంతతులన్ గయిసేసినాను కా
రణ రహితమ్ముగా గనికరమ్మును వీడి పరిత్యజించితే! ॥

52. మనమైత్రి శాశ్వతమ్మని
యనుకొంటిని నీవు గూడనంటివి యటులే
యనుకోని ఘటనలేవో
యొనగూరునటన్న యూహయును గలుగదుగా! ॥

53. ఊహలపోహలయ్యె గలయో! నిజమో! యెఱుగంగరాక యీ
స్నేహ సరోవరమ్ము సుడిచే గలగుండు వడెన్ నిజమ్ము సం
దేహములేదు నా హృదయ ధీరతయున్ భవదీయ చేష్టచే
వ్యాహతమయ్యె నేడు తగవా! పికమా! ననువీడిపోవుటల్ ॥

54. నాదరినుంట, నాదు వదనమ్మును గాంచుట, నాదు నీడలో
సేదను దీర్చుకొంటలెక-సెక్కములైనవి నీకు జిత్త స
మ్మోదమెలర్పలేని చెలుముల్ కలకాలము నిల్వబోవు నే
గాదని యందునా! మనసు కల్గిన చోటునకీవు పోవుచో! ॥

55. వీడినదానవొక్కపరి వెన్కటి మిత్రుని జూచి పోవగా
గూడదటంచునెంచితివొ! కోయిల పాటను వింటకెల్లరున్
వేడుక జూపరే! యటుల వీనుల విందుగ బాట విన్చి, నీ
జాడనెఱుంగ జేసినను జాలును నే సుఖముందునిచ్చటన్ ॥

56. పాటయేగాదు నీనోటి మాటగూడ
జెవులయందుననమృతమ్ము జిలుకుచుండు
గనుక దూరమ్మునుండి పల్కంగ దగవొ!
'క్షేమమా మిత్రమా'! యను జిన్నమాట ॥

57. ఆ చినమాట చాలు హృదయాంతరమందున గోటి దివ్వియల్
తోచును, జిమ్మ చీకటులు త్రోయును, వ్రాయును గావ్యరాజముల్
వేచినదెల్ల బీడకల, వీనులబడ్డదియే నిజమ్ముగా
నోచిన నోములన్నియు ననుంగరుణించెనటంచు నెంచెదన్ ॥

58. గుప్పెడు గుండెలోగలుగు గోటి తలంపులు మంచు కత్తులై
చప్పుడు చేయకుండ బెలుచన్ బలుముక్కలు సేయుచుండె నీ
విప్పటికేని నన్నుగరుణించి, యొకానొక పల్కరింపుతో
ముప్పున బడ్డ నా హృదయమున్ బరిరక్షణ సేయగా దగున్ ॥

59. నీ సంతోషమ్మునకున్
వీసమ్మంతయును నడ్డువెట్టను జుమ్మీ
నీ సాన్నిధ్యము గోరనె
యాసలు నీ పల్కరింపులందుట గొఱకే! ॥

60. మేనెల్లం జెవులయ్యె 'నీకు గుశలంబే!' యన్న నీ పల్కరిం
పేనాడైనను గల్గునా యనుచు గానీ! యా యొయాసిస్సు నా
కై నీవేలననుగ్రహింపవొ! మనంబయ్యె! యెడారిన్ మృగం
బై, నానాటికి శల్యమై పొగిలెనేలా! జాలి లేదాయెనో! ॥

61. ప్రాత మిత్రునకొక చిన్న పలుకరింపు
పులకరింపును వేయి యేన్గుల బలంబు
దవ్వు-దవ్వుల జిఱునవ్వు రువ్వునాడు
గాంచనాబ్జముల్ దల గ్రుమ్మరించినటులె ॥

62. కల-కలనాడు నీనగవు కన్నుల పండువు గావలెన్ రహిన్
జల-జల రాగగీతికల చాయలు వీనుల విందు గావలెన్
గల-గలనాడు నీపలుకు కానుక గావలె నాదు జన్మకున్
మిల-మిలలాడు నీకనుల మేదుర కాంతికి నేను దాసుడన్ ॥

63. చూచుచునుంటి నాయెదురు చూపుల-తూపులు నాదు గుండెనే
వేచుచునుండె, నీపలుకు విన్న క్షణమ్మునయందె తూపులన్
సైచెడి శక్తి వచ్చు, బలుచాయల దీపి తలంపు బూతలన్
బూచెడి రక్తి వచ్చు, రసపూర్ణ ఫలాన్వితమౌను జన్మమున్ ॥

64. అని పరి-పరి విధములుగా
వనరుచు నిలుచున్న మావి వైనము గడకొ
మ్మననున్న చిల్క గమనిం
చినదై వెదుకాడి చెంత జేర్చెను బికమున్ ॥

65. తనకోసము తనువెల్లను
గనులై కన్నీరు గార్చు క్ష్మాజముగని, సాం
త్వనముల్ వల్కెను, దీయం
దనమునకే తీపి పూత తనరన్ బికమున్ ॥

***

## ౨. పిక హృదయము

66. ఓయి రసాలమా! తగునె! యూరక-వారక కుంది వందుటల్
నీయనురాగ వైఖరిని నేను నిరాకరణమ్ము నెన్నడున్
జేయను జేయజాలను రుచిప్రకరమ్ముగ బెక్కు భంగులన్
గేయములాలపించి, పులకింపగ జేసెద నిన్నవశ్యమున్ ॥

67. నీ చివురాకులన్ మెసవి, నేర్చిన గానము నీకె యంకితం
బై చిరకాలముండవలెనంచు దలంచితి నా యెడందలో
బూచిన మైత్రి నీచరణ పూజనుగాక ఫలింప నేర్చునే
చూచినదెల్ల సత్యమనుచున్ దలపోయగరాదు నేస్తమా! ॥

68. నిను విడనాడి పోయితిని నీపయి ప్రేమ త్యజించి గాదు , నం
దనవన పారిజాతము ముదమ్మున దత్కుసుమ ప్రవాళమున్
గొనుమని కాన్క వెట్టినను గూర్మి జనింపదు నాకు నీవొసం
గిన జివురాకులన్ దినుటకే మనసౌను నిజమ్ము నమ్ముమా! ॥

69. అంతటి ప్రేమయున్న దగునా! విడనాడుటయంచు నన్ను బ్ర
శ్నింతువు నిక్కమే, పరవశింతువు నీవు మదీయగాన వా
సంతమమోఘమంచు శ్రుతి సౌఖ్యముగా విని; గ్రీష్మమందునన్
గొంతును బట్టుచుండె నపకూజితముల్ శ్రుతిహీన సంగతుల్ ॥

70. అపశబ్దమ్ములతోడి కైత మదికాహ్లాదమ్ము కల్గించునే!
యపరాగమ్ములపశ్రుతుల్ దొరలుచోనాపాట శోభించునే!
యపురూపమ్మగు నాదుగానము పునఃప్రారంభమై వర్ధిలన్
దపమున్ జేయగగోరి పోయితిని శ్రద్ధాభక్తి యుక్తమ్ముగన్ ॥

71. పుట్టుకతోడ బాడగల పోడిమి వచ్చినదంచు సంతసం
బుట్టిపడంగ గంతులిడుచుంటి, వసంతము తానుబోవుచున్
బట్టుకపోయె నా గళము, బాపురె నే నడిమింటి మూగనై
నెట్టుచునుంటి గాలమును నీరవ నీరస సారహీనమున్ ॥

72. మంగళమైన నాగళము మాటుననే నిగళమ్ము డాగెనో
బంగరు బాట జీవితము పాటల పేటికయంచునెంచి నా
కుంగల స్వప్న సౌధమునకున్ బలుమారులు వెల్లవేసితిన్
రంగులు పొంగులున్ గలవరమ్ముల సొమ్ములు సొమ్మసిల్లితిన్ ॥

73. ఏటికి రెండుమాసములహీనముగానెలుగెత్తిపాడు నా
పాటకు జంటిపిల్లలును బ్రాయము వచ్చినవారు వృద్ధులున్
బోటులు పూరుషుల్ తనువు మొత్తముగా జెవిచేసికొంద్రు ము
మ్మాటికి నిందటిందఅభిమానులు గల్గుట భాగ్యమే గదా! ॥

74 కానీ! యామని దాటిపోవగనె నాగాత్రమ్ము చిత్రమ్ముగా
దానై మూగదనమ్ము దాల్చెను బరాస్తంబయ్యె గాంధర్వ వి
ద్యా నైపుణ్యము, సార్వకాలికముగానానందమందింపవే
లా! నాగాన కళా విలాస మహిమోల్లాస ప్రబంధార్థముల్ ॥

75. పాడక యుండలేను రస వైభవ గీతికలెల్ల కాలమున్
బాడగలేను బాడుటయు, బాడకయుంటయు నేను గెల్చుటో
యోడుటయో యెఱుంగ, వరమో! యిది శాపమొ! దైవమిట్టులా
టాడుచునుండె నాగళమె యావిధి మెచ్చిన యాటవస్తువో! ॥

76. ఉండిననుండగావలయునుండెడి యోగము లేనినాడు లే
కుండగ బోవుటెల్ల సుఖము-ఉండియునుండమి శత్రుకోటికే
నుండగరాదు నాగళమునూచుచునుంటివి మాయ దైవమా!
పండుగ జేసికొమ్ము నను బట్టి పదంపడి పీడబెట్టుచున్ ॥

77. ఓయి రసాలమా! గుఱుతులున్నవె! నీకడకొమ్మనెక్కి నే
నూయలలూగుచున్ జగమునూచితినే! యెలుగెత్తి పాడుచున్
దీయని గానమీ జనికి దేవుడొసంగిన కాన్కయంచు; నే
డా యెలపాట యెందు గలదా! యనుచున్ వెదుకంగబోయితిన్ ॥

78. కంటికి నిద్రరాదు నినుగానక, గానము సేయకుండ ని
న్నంటగలేను, నీ చివురులానగలేను, మదీయ దైన్యమున్
వింట ద్వదీయ మానసము వేదనకున్ గుఱియౌనటంచు నే
నుంటిని జెప్పకుండనెటకో! పయనించితి ధ్యాన చిత్తనై ॥

79. నేనొకనాడు నీ గుబురు నీడల మాటున డాగి, మెల్లగా
గానము సేయువేళ నయగారముగా మలయాద్రి మంద మం
దానిల వీచిసోకి, చివురాకు ననున్ స్పృశియించువేళ నె
మ్మేను వహించి, పొంగినది మేదురముల్ పులకాంకురమ్ములన్ ॥

80. శ్రుతి పక్వమ్ము కుహూ నినాదము త్రయీ శుద్ధాంత వాణీ కర
ద్యుతి సంశోభిత కచ్ఛపీ ధ్వనికహో దోబుట్టువంచున్ వచిం
చితివే నీవు రసాలమా! యెడదనూచెన్ బల్కులానాటి సం
గతులేమాయెను నేడు? కాల మృగరాట్ కంఠమ్ము పాలాయెనో ॥

81. నాపాటకు దల యూచని
పాపాయియు, నరుడు, పశువు, పామును గలవా?
యా పరిపక్వ శ్రుతి గా
నాపగలో స్నానమాడెనఖిల జగమ్మున్ ॥

82. మోదముతోడ నే నినదముల్ రచియించెడి వేళలందు నా
నాదము విన్న పిల్లలనునాదము సేయుచు నవ్వుకొందురా
యా దరహాస చంద్రికలనంటి చకోరము 'గానహీనవై
పోదువ'టంచునీర్ష్యపడిపోయి శపించినదేమొ! నన్నిటుల్ ॥

83. నడకలలో గల బెడగులు
సడలవు గద యంచలకును జక్కని నాట్యం
బెడమగునే నెమళులకున్
విడువంగానేల గాన విద్య పికమ్మున్ ॥

84. నాద బ్రహ్మోపాసన
సాధించుట కొఱకు దపమొ! జపమో! సేయం
గా దరలితినే గానీ!
కాదు సుమా! నీదుమైత్రి గాదని చనుటల్ ॥

85. పంచమమాలకించిన ప్రపంచము మిక్కిలి తన్మయత్వమున్
గాంచి, పురాభవమ్మున బికమ్ము మహేశుని దేనెజాలులో
ముంచినదేమొ! తత్ఫలము మొత్తము నేటి భవమ్మునందు బ్రా
ప్తించినదేమొ! యంచు వినుతించును నన్ను వసంతవేళలన్ ॥

86. మంచికి, మానవత్వమను మాటకు జోటును లేని నేటి ప్రా
పంచిక ధోరణిన్ విసువు వడ్డ జనమ్ములకూరటమ్ముగా
వించు మదీయగానము మహీరుహరాజమ! పాక్షికమ్ముగా
ద్రుంచె విధాత నాయెడల దోషములేమి స్ఫురించెనోగదా! ॥

87. కవికి, గాయకునకు గూడ గౌరవమ్ము
కోకిలమ్మను బిరుదమ్ము కూడియుంట
యట్టి నాకేల బాక్షికంబాయె శక్తి
వారి-వారికి బ్రదుకెల్ల వఱలుచుండ ॥

88. కవి గాయక వైతాళిక
భువిలో నాజేయు గానమునకెంతటి గౌ
రవమున్నది యది నిత్యం
బవుచో బైడికి సుగంధమబ్బుట గాదే! ॥

89. పరమహంసకు బ్రణవ సబ్రహ్మచారి
కుహు-కుహూ రుతి; స్మరకళా కోవిదునకు
పంచశర శంఖనాద సబ్రహ్మచారి
యోగి, భోగియు నాకు దాసోహమనును ॥

90. పుట్టిననాడు నన్ బొందుగు బోడిమి లేమిని గాకిగూటిలో
బెట్టెను గన్నతల్లి, ననుబెంచిన తల్లియు వీను దోయితో
ముట్టి కుహూరుతమ్ము, తన పుత్రిక గాదని గెంటివైచెన
ట్టిట్టనరాని దుఃఖమునకిచ్చినదూఱట గానశక్తియే ॥

91. తలవ్రాతగాక యమృతం
బొలికించెడు గానమైననుండగరాదో
కలకాలము; పరభృతముల
కలమినదేశాపమో? యనాదిగనిటులే ॥

92. పక్కులయందే జాతికి
దక్కని మంగళ గళమ్ము దక్కినదని నే
జొక్కుటయో! శాశ్వతముగ
జిక్కమి స్రుక్కుటయొ! యేమి చేయగవలెనో! ॥

93. పన్నీరొక కంటను సం
పన్నమ్మై వఱలు గాత్రవైభవమునకున్
కన్నీరు మఱొక కంటను
మున్నీరై పొంగి-పొరలు మూగతనమునన్ ॥

94. నా దుఃఖమ్మును నీకుజెప్పి, సతతానందంబుతోనుండు నిన్
ఖేదాంభోనిధి ముంచివైచుటకు జంకెన్ నాదు చిత్తంబు నా
పై దాక్షిణ్యముతోడ జింతిలుట నీవంతౌటయేగాని, సం
పాదింపంగలవే! పురా గళ మహత్వ ప్రాభవౌన్నత్యముల్ ॥

95. ముందుగ జెప్పినన్ విడిచిపుత్తువె?  యేటికి రెండుమాసముల్
విందులు చాలు వీనులకు వీడగరాదని పల్కి, యుండిపో
మ్మందువు నిచ్చలున్ గుబురులందున నీవు వసించుచున్న జా
లందువు గాన, బోయితి రహస్యముగా బరువైన గుండెతో ॥

96. కాదనలేను నిన్ను మమకారముతో బెనవేసికొన్న స్నే
హాదర బంధమౌట జివురాకుల సత్కృతినంది, మద్గళ
స్వాదిమ కాన్క వెట్టునెడ బ్రత్యుపకార ఫలమ్మునందెదన్ గాదె!
ఋణమ్ము తీర్చుకొన గల్గుటయే గద చారితార్థ్యమౌ ॥

**నిశీథిని :**

97. కన్నులు గానరాని యొక గాఢ నిశీథము చాటు-మాటుగా
బన్నుచు దోషకృత్యములు స్వైరవిహారము సేయువారికిన్
మన్నన గల్గు గాలము, ప్రమాదము-మోదము గుత్తెఱుంగ రా
కున్న విచిత్రమైన స్థితికూనిక, వేదిక స్వప్న కోటికిన్ ॥

98. నిద్దుర పోవుచో జెవికి నీరవమేగద! కంటికాంధ్యమే
వద్దనరాదు నచ్చనిది వాంఛితమున్ గ్రహియింపరాదుగా!
పెద్దకు బిన్నకున్ గనము భేదము వాదములుండబోవు పెన్
గద్దెను నిల్చువాడతని కాళులనంటెడు వాడునొక్కటే ॥

99. చీటికి-మాటికిన్ గొడవ చేయుచు బ్రొద్దులు పుచ్చువారికిన్
బూటకు బొట్టపోసికొన మోపులు మోయుచు సాగువారికిన్
గాటికి గాళ్ళుసాచుకొని కాలము సైచెడి బెద్దవారికే
పాటునెఱుంగనట్టి పసివారికి నిద్దుర యొక్కటే గదా! ॥

100.తనవారని, పెఱవారని
మనమునగల భేదమెల్ల మటు మాయమగున్
గునుకుం దీసెడి వేళల
బెను నిద్దురకంటె దత్త్వవేదిక గలదే! ॥

101.కాంక్షలెన్నియో కడగి తెక్కలను దొడిగి
స్వప్న లోకాల విహరించు స్వైరగతిని
వాస్తవమ్మును విడనాడి భ్రమలయందు
దిరుగుచుండును జీవి నిద్దురకు లోగి ॥

102.కనరానిది వినరానిది
యనరానిది చనగరానిదన్నది గలదే!
తన కోర్కెలు తీరుటకై
యనువైనది నిదుర యొకటె యవనీస్థలిలో ॥

**స్వప్నవీథి :**

103 పరవశమ్మున గాకమ్మ పాడవచ్చు
మేటి సింగమున్ గెల్చు గుండేటి పిల్ల
గొడ్డురాలయ్యు బిల్లలకోడి యగును
స్వప్న జీవికి గలదె! యసాధ్యమొకటి ॥

104.రోగికి లేదు పథ్యము, మరుల్ గొని లే జవరాలి కౌగిలిన్
లోగిలి జేసికొంచు వఱలున్ సుఖశయ్యు నపుంసకుండు, స్వ
ర్భోగ పయోధిలో మునిగి పోవును బూటకు లేనివాడు , కా
రాగృహ వాసియున్ నెఱపు రాచరికమ్మును స్వప్న వీథిలో ॥

105. కలగాదు జీవితమ్మని
పలుకుదురేగాని, వాస్తవమ్మ్మననే కో
ర్కులు ఫలియింపవవొ! వానిని
ఫలవంతము చేయగలుగు స్వప్నమ్మొకటే ॥

106. కలయన్నది లేకుండిన
గలవా జీవితమునందు గమ్మందనముల్?
తెలవారెడి బ్రదుకులలో
గలలకునై రాత్రియొకటి కావలయుగదా! ॥

107. వడ్డించిన విస్తరులకు
నడ్డమ్మా జీవితముననాయా సుఖముల్?
బిడ్డల గని సాకుటయే
గడ్డుగ నడయాడు జనికి గలలే కలుముల్ ॥

108. మానస సరోవరమ్మున
మానితముగ నడచునంచ మధుర స్వప్నం
బానడకల మెచ్చని వా
డౌనా రసికుండు? సాధ్యమా కాదంటల్ ॥

109. హృదయ పద్మమ్మునందునన్ గుదురుకొనిన
యమృతబిందువై యానందమందజేయు
స్వప్నమే లేనిచో వాస్తవమ్మ విషము
కుడితిలోబడ్డ యీగయే బడుగు జీవి ॥

110.ధనమైనను బాండిత్యపు
గనియైనను నిదురమాని కష్టించినచో
దనవశమగు స్వప్న సుఖం
బును హాయిగ నిదుర వోయి పొందగ వచ్చున్ ॥

111.నీవటువంటిరాత్రి సుఖ నిద్రకు దోగుచు స్వప్న వీథిలో
బోవుచునుండగా విడిచి పోయితి బంధురమైన గాన వీ
చీ విభవమ్ము నెట్లయిన జేగొననెంచి, రసజ్ఞ లోక సం
భావితనై చరింపగలభాగ్యము గోరి తపమ్ము చేయగన్ ॥

112.అంతియే కాని నీహృదయమ్మునందు
జిచ్చు రగిలించి, చలి గ్రాగు జిత్త వృత్తి
యెడద కోసి చూచిన గనంబడదు సుమ్ము
విశ్వసింపు రసాలమా! వేయునేల ॥

113.తపమును జేయుచుంటి జడదారిబలెన్ గడుదీక్షతోడ వే
లుపులకు మ్రొక్కుచుంటి మదిలోగల కోర్కులు దీర్పుడంచు వి
న్నపములు సేయుచుంటి వదనమ్ము నిరంతర గానపేటియై
విపుల యశోవిలాసముల వేదికయై వెలుగొంద జేయగన్ ॥

**శుకదర్శనము :**

114.నేను దపో భిమానమున నిష్ఠగ గన్నులు మూసి దైవత
ధ్యానము సేయుచున్న సమయంబున ఱెక్కల గాలి సవ్వడుల్
వీనులయందు దోచి, కనువిచ్చితి ధాతృసతీ కరాంబుజా
స్థాన శుకౌఘసమ్మయిన సంతతి జక్కని చిల్క గాంచితిన్ ॥

115.పదికాలమ్ములు పచ్చగా మనుటనే వాంఛింతురెవ్వారు సం
పదకుం బచ్చదనమ్ము గుఱ్తుగుటనావర్ణంబు జన్మంబు తో
డిదిగా జీవితమెల్ల నిల్పుకొను గంటే! చిల్క సౌభాగ్యమ
య్యది పల్కాడిన వేదనాద నిభమే! యానంద సంధానమే! ॥

116.భారతి చేతిలో నిలచు వైభవమున్ గొని, బ్రహ్మ నిత్యమోం
కార పురస్సరమ్ము శ్రుతి గానము సేయగ సంత జెప్పుచున్
సారెకు గందెనా నెఱుపు చాయను దాల్చిన చిల్క మోము సిం
గారము సంతరించుకొని కంటికి విందులొసంగు నిచ్చలున్ ॥

117.ఆదరమ్మున నలువ వినోదమునకు
నింపు దళుకొత్త వీణ వాయించువేళ
భారతీహస్త కంకణ స్వనము వినెనొ!
చిలుక పలుకులయందు దేనెలు స్రవించు ॥

118.అనయము కచ్ఛపి నాద
మ్మును జెవులారంగ వినుచు బొంగుచు సతమున్
మననమ్ము చేసికొనుటన్
గొనెనో! శుకజాతి పలుకు గులుకుం దళుకుల్ ॥

119.చిలుకల పలుకులలో గల
కులుకుదనము మెచ్చి, పెంచుకొందురు జనముల్
గళమెత్తి పాడినన్ గో
యిలలను బెంచుకొన జూతురే! యెవరేనిన్ ॥

120. చిలుకకు రూపము తోడుగ
బలుకులనందించినట్టి భగవంతుడు కో
యిలలకు రూపమ్మొసగక
గళమే, యదియును బరిమిత కాలమె యిచ్చెన్ ॥

121. సరియే! యెవ్వరి భాగ్యమెవ్వరికి నోచన్ వచ్చులే! గాన భా
సుర సౌభాగ్యము సార్వకాలికముగా శోభావహమ్మౌటకై
స్వర పేటీ మృదు నాదరంజితము విశ్వమ్మెల్ల కాలమ్ము సం
బరముం గొంటను జూచి, ముచ్చట పడన్ మౌనిత్వమున్ బూనితిన్ ॥

122. నీకుం గల్గిన కొమ్మలన్నియునునిండ్లే పక్కులెన్నింటికో
సాకల్యంబుగనింత పుణ్యమును నిచ్చల్ చేయుచున్నట్టి నీ
కై కైవల్యమునిచ్చి తీరవలయున్ గంజాత సంజాతుడం
గీకారమ్మొనరించు దజ్జనకుడున్ గేదారుడున్ బ్రేముడిన్ ॥

123. నీ కొమ్మలయందొక్కటి
యీకీరమ్మునకు నిలువనిచ్చెన్ జోటున్
నీకుంగల యావేదన
నాకెఱిగింపం దలంచి నాదరి చేరెన్ ॥

124. చీమ దూరరాని చిట్టడవులయందు
చూచి-చూచి కడకు సోలిపోయె
కాకి దూరరాని కాఱడవులయందు
వెదకి-వెదకి తుదకు విసిగి పోయె ॥

125. తుదకెట్లో పసిగట్టి వచ్చినది చేతోమోద సంధాన సం
పదకుం దానొక పుట్టినిల్లగుచు సంభావించి, ప్రశ్నించె ము
మ్మొదటన్ నాకుశలమ్మునాపిదపనేమో! పల్కుచున్- బల్కుచున్
దుదకున్ నీ పరివేదనమ్ము దెలిపెన్ దోడ్తోనిటన్ వ్రాలితిన్ ॥

126. ఇప్పటికైన మానగదవే! పరివేదన, నీవు గాక నా
కెప్పటికేని వేరొక మహీజము భాజనమై తలిర్చునే!
తప్పిటు గుందరాదు పరితాపముచే గృశియించి పోవుచో
ముప్పునుబొందవే! ఫులుగు పుంజములెన్నియొ గూండ్లు వాయుటన్

**శుక హాసము :**

127. కోకిల పల్కులన్నియును గూర్మిమెయిన్ దనువెల్ల వీనుగా
జేకొని యాలకించిన విశిష్ట రసాల మహీజమూరటన్
గైకొనుచుండెనంతట బకాలుమటంచును జిల్క నవ్వెన
య్యా కలహాసనాదమునకబ్బురపాటు పికమ్ము గాంచగన్ ॥

128. నవ్వు పువ్వులేల రువ్వుచున్నది చిల్క
వింతలేమి కలిగెనింతలోనె
నాదుపలుకులందు నాభావనములందు
దొసగులేమియైన దోచెనేమొ! ॥

129. గుండె బరువుతో వచ్చి వాకొంటి నేను
గుండె దిగులును దగ్గించుకొనగ దరువు
నాదు వేదన చిలుకకానందమగువె
యేలనొనరించునో! యవహేళనమ్ము ॥

130. అనుచున్ బరి-బరి విధముల
మనమునదర్కించి, పలుకుమా! యుద్ధవడిన్
నిను నవ్వించిన విషయ
మ్మును మాకని పికము కీరమున్ బ్రశ్నించెన్ ॥



***

## 3. శుకోపదేశము

131. అంతలోననే చిలుక నవ్వాపుకొనుచు
పలుక జొచ్చినదమృతమ్ము చిలికినట్లు
వేద-వేదాంత విజ్ఞాన వీథులందు
సాగిపోయెడు నిర్మల యోగివోలె ॥

132. లేవడి వేళ గుందెదరు, లేమికి లేమి యొకింత గల్గినన్
రావలెనింతకంతయని రాతిరియున్ బవలున్ దదేక చిం
తా వశులై చరించెదరు తాలిమికిం జెడి, కర్మ బద్ధులై
జీవుల చిత్త వృత్తులు విచిత్ర పరిస్థితికాలవాలముల్ ॥

133. లేనిది లేక పోయెనని రేబవలున్ దపియించి పోయినన్
గాని లభించునే! తనకు గల్గిన దానికి సంతసించు వి
జ్ఞాని; జనించు గోరికలు కళ్ళెమెఱుంగని పెంకిగుఱ్ఱముల్
వానిని నిల్వరించగల వాడొకడే సుఖియించు నిచ్చలున్ ॥

134. ఎన్నిఫలుంగులున్నవి మహీస్థలి వానికి లేని గొంతు నీ
కున్నది దాన సంతసమునొందక యుంటివి-అనార్తవమ్ముగా
కున్నదటన్న చింత భయదోరగమై నినుగాటువేయు నా
డున్నది గూడ లేనిదగుచుండును లేనిది లేక పోవగా ॥

135. ఇంతకు మున్ను నీవు ధరియించిన కాయమునందునేగుణం
బెంతగదాల్చితో యెఱుగవీపయి జన్మములెట్టులుండునో
యంతకు మున్నె నీవెఱుగవైతివి, యీనడుమంత్రమైన క
వ్వింతలు, వింతలున్, హృదయ వేదనలున్, సుఖముల్ నిజమ్ములే! ॥

136. నీకైనది నీకున్నది
కాకున్నది దిగులుపడిన గైవసమగునే!
నీకంటికి గనుపట్టెడు
లోకమ్మే కల్ల నీదులోపము నిజమా! ॥

137. గుణదోషమ్ములసత్యము
లణువణువున నిండియున్న యాదైవమ్మే
గణనీయమ్మును సత్యము
ప్రణవమ్మున కంటె నాదవైభవమున్నే! ॥

138. ఎచట జన్మింప వలయునో! యెట్టి తనువు
పొందుటో! యెట్టి వైభవమ్ములను గొనుటొ!
దైవతాధీనమే గాక జీవకోటి
కెన్నడేనియు స్వేచ్ఛ లభించునటవొ! ॥

139. దూరస్థమ్మగు బర్వతమ్ము నునుపై తోచున్, సమీపస్థమౌ
సారోదార విశేష వస్తువును నిస్సారమ్ముగా దోచునె
వ్వారున్ గన్గొనరాని హంసములకే ప్రాధాన్యమౌగాక చ
క్షూ రాజీవ సుగోచరాండజము వాకోజూచునే కావ్యముల్ ॥

140.సప్త సాగరమ్ముల దాటి చనిన గాని
ప్రాప్తమున్నది నీవెంట బడును గాక
యాముదము పూసికొని పొర్లినపుడు గూడ
ప్రాప్త హీనునకున్ సిరి యంటుకొనునె ॥

141.ప్రాప్తాప్రాప్త విచార హీనులగుచున్ వాంచా మహాజ్వాలికా
తప్తంబై నడయాడు జీవితము చింతా దగ్ధమౌటన్ సుఖా
వాప్తిన్ వ్యర్థము చేసుకొందురుగదా! యాశాంగనాంకస్థలీ
సుప్తుల్, శప్తులు, తృప్తిహీనులు, జనుశ్శోకాబ్ధి నిర్మగ్నులున్ ॥

142.కుడితిని బడ్డ యీగలయి కొట్టుకబోవుట దక్క గట్టుపై
బడుటకు యత్నమున్ జలుపు వారలు కానగ రారు ధారుణిన్
గడ-బిడ వీడి, శాంతిసుమ కాముకులై విలసిల్లువారు క
న్పడరు వియల్లతాంతములపైనడియాసలతోడ సోలుచున్ ॥

143.నీడలు వెనుకంబడి, వెం
టాడెడు జందమున గలుగు బ్రారబ్ధంబుల్
వీడవు గద! యోడవు గద!
పీడించుచునుండవే! వివేక విదూరున్ ॥

144.కాటికి గాళ్ళు చాచుకొను గాలమునందునగూడ బూటకుం
బూటకు గ్రొత్త కోరికలు పుట్టుచునుండును దత్ఫలాప్తికా
రాటము, దీరకుండిన జిరాకు-బరాకులతోడి చేటు పో
రాటమిలాస్థలిన్ గలుగు బ్రాణికి బూటకమెల్ల బంధముల్ ॥

145. చెట్టులొసంగు నీడలకు జేరుదురయ్యావి సూర్యయానముం
బట్టి పరిభ్రమించుననను వాస్తవమున్ గ్రహియింపలేక, యా
చెట్టునె చెట్టయంచు నిరసింతురు ప్రాణికి గల్గు బంధముల్
పుట్టుచుబోవుచుండుగద! భూజమొసంగెడు నీడపాటివై ॥

146. తలక్రిందుగ నిలబడి, గ
బ్బిలమెంతగ దపము సేసి, వేదన పడినన్
గలుగునె మేనునకుం బరి
మళములు వెదజల్ల గలుగు మాహాత్మ్యంబుల్ ॥

147. కవికి గానమ్ము సేయనుత్కంఠ గలుగు,
గాయకునకు గైతలు వల్క గాంక్ష వొడము
కలిగియుండినదది యెల్ల గడ్డిపోచ
లేనిదెల్లప్పుడును దలమానికమ్ము ॥

148. విలువలనెఱుగని వారికి,
కలిగిన గుణమెల్లనడవి గాచిన తెలి వె
న్నెలయే, తెలిసిన వానికి
గలిగినదొక గడ్డిపోచ కలుముల గనియే ॥

149. తనకుం బుట్టుక తోడ వచ్చినది పంతంబూని పోనెట్టినన్
దనకుందోడయి, నీడయై తనువుతో దాదాత్మ్యమున్ జెందెడి
దనకుం బుట్టుక తోడ గల్గనిది పంతంబూని రాబట్టినన్!
దనకుం దూరము-భారమై నిలచు జెంతం జేరదేనాటికిన్ ॥

150.వలదని చెప్పినన్ వినదు పాడుమనమ్ము భరింపరాని కో
ర్కెలపయినాధిపత్యమును రేపును-మాపు వహించి, నిత్య సం
కుల సమరమ్ము నేర్పరచి, కొంటెగ నవ్వును, నిశ్చలస్థితిన్
గలిగిన గాని చిత్తమును గట్టిడి జేయగ జాలరెన్నడున్ ॥

151. ఉదయంబస్తమయంబు భాస్కరునికే యున్నప్పుడా కాంతిచే
గదలం గల్గినయట్టి దేహులకు రాకల్ పోకలుం దప్పునే
మద మౌఢ్యమ్ములు, ప్రేమ బంధములు, కామ క్రోధముల్ మధ్యలో
గుదిబండల్ మెడ గట్టుకొందురవివేకుల్ భ్రాంత చేతస్కులై ॥

152.వెన్నెల తేనికంటె గనువిందు, మనమ్మునకుం బ్రమోద సం
పన్నత గూర్చువాడు గనుపట్టునె! యంతటి వానికే క్షయం
బున్నది, వృద్ధియున్నది, గ్రహోరగముల్ కబళింపగోరి మా
టున్నవి యల్పజీవికగునో! గ్రహపాటునతిక్రమించుటల్ ॥

153.ధారుణికంటె నెక్కుడగు దార్ఢ్యము కల్గినదేది? సృష్టి కా
ధారము తానయయ్యును స్వతంత్రత వాసి, ప్రదక్షిణమ్ము నీ
హారవిరోధికిన్ గువలయారికి జేయు నిరంతరమ్ముగా
నూరక నేను-నాది యనుచుండును దేహి స్వతంత్రతామతిన్ ॥

154.అందని పారిజాతమునకఱ్ఱులు చాచి, పెరంటి పాదపం
బందగ జేయు గ్రొవ్విరుల యందము, వాని పరీమళమ్ము, మా
రందము మెచ్చజాలక నిరాశకు లోనగుచుండునూరకే
కొందలపాటు దక్క సమకూరవుగా సుఖముల్ వినోదముల్ ॥

155. ఇది రంగస్థల మన్ని పాత్రలకు, దానేపాత్రకున్ యోగ్యుడో
యదియే దాల్చుట, దానికిన్ దగిన యాహార్యమ్ము గైకొంట స
మ్ముదమై యొప్పును గాని, యన్యవిషయమ్మున్ మెచ్చి, నర్తింప మె
చ్చదుగా లోకము, రక్తిగట్టదు పయిన్ సంధిల్లు వైరస్యముల్ ॥

156. మనసున మారుమూలలను మాసిన చాటిక లెన్నియున్నవో
కనుగొనలేక స్వచ్ఛముగ గన్పడకుండె బ్రపంచమంచు నిం
దను దలపైని మోపెదరు, దర్పణమెంతటి స్వచ్ఛమైనదై
నను నగుమోము గానియెడ నవ్వులు తాను సృజింప గల్గునే! ॥

157. నగవులు మోము తమ్మిపయి నాట్యము సేయుట ప్రాగ్భవార్జితం
బగణితమైన పుణ్యఫలమంచు గ్రహింపక వేదనా మతిన్
బొగులుచు గ్రుంగిపోవుచు బ్రమోద పదార్థము లేనికోశమై
వగచెడి వారికిం గలుగు వైభవమంతయు వ్యర్థమే గదా! ॥

158. దక్కిన పర్వతమ్మణువు దక్కనిచోనణువేమహత్తు చే
జిక్కిన దానిచే నగవు చిక్కక, చిక్కని దానికోసమై
స్రుక్కెడి వారు జీవన రుచుల్ గ్రహియింపగజాలరున్నదే
మిక్కిలి యిష్టమై మనుట మేలుగదా! యెటువంటివారికిన్ ॥

159. మానసమందునన్ దిగులు-మాయని గాయము మందులేదు మం
దానిల వీచియైన విరహస్థితియందున దాపహేతువే
యైనటులెట్టి శక్తి తనయందుననున్నను దుఃఖ చోదనం
బునకగు గాని సంతసము పుట్టునె? ముట్టునె సత్ఫలమ్ములన్? ॥

160. జలజములోని యందము నిశా సమయంబున లేకపోవుటన్
విలవిలలాడునే! పగటి వేళల దేనియ విందుసేయగా
గలుగుటె భాగ్య వైభవ వికాసముగా దరహాస మాధురీ
విలసితమైన జీవన వివేకముతో విలసిల్లు నిచ్చలున్ ॥

161. దప్పిక వెన్నెల పుల్గున
కెప్పుడు పున్నమియొ యప్పుడే తీరుటనె
ల్లప్పుడు పున్నమి యుండమి
ముప్పనుచున్ దలచి, దిగులు పొందుట తగవే! ॥

162. ఎవ్వరి గర్భగోళమున నింతకు ముందు శయించుటాయె! దా
నెవ్వరి తీపి పొత్తిళులనీపయినాటలనాడనుండెనో!
యెవ్వరు మిత్రులో! యరులునెవ్వరో! బంధుగులెవ్వరెవ్వరో!
యవ్వలనివ్వలన్ దెలియనట్టివి యీనడిమింటి యాతనల్ ॥

163. కాల మహత్త్వమున్ దెలియ గల్గిరె విజ్ఞులు సర్వశాస్త్ర వి
ద్యాలలనా మనోజ్ఞ హృదయాంబుజ జాత మరంద బిందువుల్
గ్రోలి, శరీర కార్శ్యమునకున్ వెఱగొందక వాయు భక్షణా
భీల తపో భిమానులయి, వేదనలంబడి క్రాలి-సోలియున్ ॥

164. పుట్టడు వెంట దెచ్చుకొని, పోయెడునాడు రవంతయేనియున్
బట్టుక పోవడీ నడుమ పట్టిన సంపద స్వప్నమందునన్
ముట్టిన షడ్రసాన్వితము భోజనమంచు నెఱుంగలేక తా
కట్టును బెట్టె ధర్మము ప్రకాశముగా జరియించు నిచ్చలున్ ॥

165. ఉన్నది పోదు, పోవునది యుండదు, బ్రహ్మపదార్థమొక్కటే
యున్నది, దృశ్యమానమగుచున్న ప్రపంచము వాస్తవమ్ము గా
కున్నది. భ్రాంతిమంతమగుచున్నది లోకము లేనిదానినే
యున్నదటంచు నిత్యముగనున్నది లేదనుచుం దలంచుచున్! ॥

166. స్నేహము కంటె దీయనిది జీవునకున్ మఱియొండులేదు సం
దేహము లేదు. గుండె నినదించు బరస్పర మిత్ర భావ స
మ్మోహితమై. మనోజ్ఞగుణ భూషితమౌ యనురాగ గీత సం
దోహము స్వర్ణ శృంఖలలతో భవకార గృహాన ద్రోసెడిన్ ॥

167. నేననుకొన్నవాడు మనెనే చిరకాలము! నాదియన్న వా
డేనియునుండెనే! భవములెన్ని గతించెనొ! ముందు-ముందు రా
నైనవి యెన్ని యున్నవొ! వియత్ పథ తారకలట్లు లెక్కకున్
రానివి, మిత్రబాంధవ పరంపరకావలిగట్టు తోచునే! ॥

168. కూటికి బాటులైనపుడు కోరికలుండవుగాని, దానికిన్
లోటు రవంత దగ్గిన విలోల మనస్కత భోగకోటికై
పాటుపడున్, సుఖమ్ము తనవంతగుచో 'గళ' పైని గోరికల్
మాటికి జుట్టు-ముట్టు. దరమా! పెను మాయనతిక్రమించుటల్ ॥

169. జననంబంది సుఖమ్ముగా మనుటయే సాఫల్యమంచున్ దలం
చినచో జన్మకు జారితార్థ్యమగునా! శ్రేయమ్మొ! యానందమో!
తనతోబాటుగ లోకమున్ గొనుట తాత్పర్యమ్ముగా జీవిత
మ్మును సాగించిన జన్మ ధన్యము గదా ముమ్మాటికిన్ నమ్ముమా!

170. వేసవియందు గాడుపుల వేడికి దట్టుకొనంగలేక, వ
ర్షాసమయంబు కాల్ కదపజాలమి శైత్యమునన్ వడంకుచున్
గాసిలుచుండు భోగి, తనకై భగవంతుడొసంగెనంచు సా
వాసము చేయు యోగి. రసవంతము కాలము జ్ఞానికెప్పుడున్ ॥

171. వడలిన పూవులన్ దుఃఖుమ వచ్చునె వేసలియందు? మట్టిలో
బడలిన యాకులో గుడువ వచ్చునె యెవ్వరికేని? యూరకే
గడచిన కాలమున్ దిరిగి కైవసమున్ బొనరింప వచ్చునే?
జడతకు లోను గాక నిముసమ్ము ధనమ్ముగ సాగగావలెన్ ॥

172. శైశవమందు గ్రీడలకు జాలదు కాలము, యౌవన స్మరా
వేశము గాలిమేడలను వీడదు, ప్రాయము క్రుంగి, వార్ధకా
యాస భుజంగ దష్టుడగునప్పుడు బంధము కాలకూటమై
గాసిలబెట్టు, జీవికి సుఖమ్మగునే యిహలోక వాసనల్ ॥

173. దేహము పండి, నేలబడి తీరునొకానొకనాడు, పాప సం
దోహము మూటగట్టుకొని, తోడ్కొనిపోవుటకంటె వానితో
స్నేహము వీడి, పుణ్యగుణ నీరజ జాత మరందమానుచున్
దాహము తీర్చుకొంచు సుకృతమ్ములకున్ గని యౌట మేలగున్ ॥

174. జాడలు లేవు నిన్నటివి. సంగతి రేపటికెట్టులుండునో!
నేడొకటే గదా! మనకు నేస్తము. చింతల బ్రొద్దుపుచ్చుచున్
వాడుట, కానిచో విషయ వాంఛలలో బడి కొట్టుకొంటయో
పోడిమి గాదు జీవుడు ముముక్షువు గావలె యోగి గావలెన్ ॥

175. నిన్నటి జన్మమందుగల నేస్తము కానగరాదు నేడు, నే
డున్న మహానుబంధములునుండవు రాగల జన్మయందు, నే
నన్నను, నాది యన్ననునహంకృతియో-మమకారబంధమో
కన్నుల గప్పు మాయ పొరగాని యథార్థము గాదు నమ్ముమా! ॥

176. పామర భోగ-భాగ్యములపైననురక్తిని బెంచుకొన్న వా
రేమి సుఖించి పోయిరి? యదేపనిగా గడలేని కోరికల్
స్వామిత దాల్చి, దుష్ట భవ వారిధిలో బడవైచి ముంచి, తా
మే మఱి పైకి దేల్చి, యిటులే చెలగాటలనాడు దేహితోన్ ॥

177. అందని ద్రాక్షపండ్లు రుచియా! పచియా! యవి పుల్లనైనవే
యందురు కొంతమంది, యటులందనివే కడుదీయనైనవం
చందురు కొంతమంది, యసలారుచి యెట్టిదొ! తత్త్వమెట్టిదో!
యందిన వారికే యెఱుక యాత్మ వివేచనమట్టిపాటిదే ॥

178. ఎట్టి ప్రేరణ లేకుండనెవ్విధమున
ధరణి తిరుగును దనచుట్టు దరణి చుట్టు
స్వీయ కక్ష్యనతిక్రమించినది గలదె!
యెవడు పగ్గముల్ పట్టి బిగించుచుండె ॥

179. కారణము లేక కార్యమ్ము కలుగబోదు
కార్యమీ సృష్టి దైవమే కారణమ్ము
దైవతాధీనమై జీవి తనరుచుండ
నేను-నాదని సతము చింతింపనగునె ॥

180.ధరణీ చక్రము దిర్దిరం దిరుగు నిత్యంబున్ జగన్నేత బొం
గరమై. దాన జనించు బ్రాణులకహంకారమ్ము, స్వార్థమ్ము, మ
త్సరమున్, లోభము, మోహమున్, మదమునీర్ష్యాద్వేషముల్ కండ్లకున్
బొరలై క్రమ్ముట జూచి, నవ్వుకొనదా! భూదేవి లోలోపలన్ ॥

181.హృదయ సరోరుహమ్ము పులకించు సదాశయ చంచరీకముల్
కదలిన గాక, కోరికలు కాకలు తీరిన కందిరీగలై
పొదువుచు బట్టి జ్ఞాన సుధ మొత్తము దోచుకుబోవుచో రసా
స్పదమగునే తదంబుజము, భద్ర జలాశయమౌనె జన్మమున్ ॥

182.ప్రొద్దు తిరుగుడు పూవులు పూట-పూట
దృక్పథము మార్చుకొనునట్లు తీరు-తెన్ను
లేని వారికి స్థిరమైన జ్ఞాన దృష్టి
కలుగదొక వేళ గలిగినన్ నిలువబోదు ॥

183. వగలం బెట్టుచునుంద్రు బందుగులు సేవల్ సేయుచున్, మ్రొక్కుచున్,
బొగడం జూతురు శక్తి యున్నపుడు రేపున్ మాపు, దచ్ఛక్తియే
దిగవారన్ దమయంత దూరమగుచున్ ద్వేషింతురాపాటికే
బొగులంగా మమకారబంధములతో బ్రొద్దెల్ల వ్యర్థమ్మగున్ ॥

184.జగతీనాథులనేకులీ భువిని నిచ్చల్ సార్వభౌమత్వ ప
న్నగ భోగమ్ముల నీడ నమ్ముకొని యానందమ్ముగా గుమ్ము దీ
యగ యత్నించిరి, దాని కాటువడునాడాకాలకూటమ్మునా
పగలేకోపగలేక కూలిరిగదా! ప్రారబ్ధమాపాటిదై ॥

185. కొండవంటి యాశ కుండవంటి శరీర
మందునిమిడిపోవు నట్టులుండు
చేటునెఱుగరాక చోటునిచ్చిన నాడు
కొండ పెరిగి పోవు గుండ పగులు ॥

186. శౌర్యము శాశ్వతమ్మయిన చందముగా మును పెందరెందరో
క్రౌర్యము బూని, శాంతికి విఘాతమొనర్చిరి, వారు బోయి రా
శ్చర్యము నిత్యతాత్త్విక విచారము శాంతి నిదానమాత్మ సౌం
దర్యము లేని శక్తులు వృథా పరివేదనకాలవాలముల్ ॥

187. హింసావాదము ప్రజ్వరిల్లి, సమతా దృక్కోణముల్ వాయుచున్
హంసల్ క్షీణతనంది, గృధ్ర గణముల్ వ్యాపించుచున్ శాంతి వి
ధ్వంసమ్మున్ బొనరించుచున్న జగతిన్ దత్త్వామృతంబంది, సో
హం సో హమ్మను మంత్రమున్ బలుకుటే యానంద మూలమ్మగున్ ॥

188. ఏకళకేనియున్ భగవదిచ్ఛకు లోబడిగాక యెన్నడున్
రాకలు పోకలున్ గలుగరావుగదా! యటువంటి వానినిన్
జేకొనినంత గర్వమును జెందగనేల రవంత తగ్గినన్
గైకొననేల చింత! యివికాదు కళా పరమార్థ వైఖరుల్ ॥

189. ఇన్నిమాటలు చెప్పంగనేలగాని
తనకు గలిగినదొక్కటే తనదియనుచు
తనకు లేనిది తనది గాదనుచు దలచి
తృప్తి పడునాడె సుఖము సంప్రాప్తమగును. ॥

190. పికమా! యోయి రసాలమా! హృదయముద్వేగమ్ము పాలైనచో
సకలమ్మున్ రసహీనమౌను, సతతోత్సాహమ్ము సొమ్మైనచో,
సకలోర్విన్ రస దృష్టితో గనినచో, సంతోషనీరేజమై
వికసించున్ గద! సౌరభ ప్రచురమై వెల్గున్ గదా! బుట్టువుల్ ॥

191. అని యీరీతిగ జిల్క పల్కినది వేతాంతాబ్ధియై, జీవిత
మ్మునకుం గ్రమ్మిన చీకటుల్ దఱుమగా బొల్పొందు గ్రొందివ్వెయై
వనజాతోద్భవ వేద నాద నిభమై, పద్మాసనా కచ్ఛపీ
నినదంబై, పిక భూజముల్ మురియగా నిత్యత్వ సంపాదియై ॥

**పిక రసాలాంతరంగము :**

192. అలనాటి యగస్త్యుండే
చిలుకగ బ్రభవించెనేమొ! చిత్రమ్ముగ బ్రా
బలుకుల కడనుడి కడలిని
నలవోకగ నాచమించినట్లు వచించెన్ ॥

193. ఒక సామాన్య విహంగమీగతిని జ్ఞానోద్బోధ గావించునే!
వికలమ్మైన యెడందలన్ దడవి, యుద్వేగంబు చల్లార్చునే!
సకలమ్మైన ప్రపంచమున్ విడచి, విశ్వ వ్యాప్తమైనట్టి దై
విక తత్త్వమ్మునుపాసనన్ జలుపునే! వేదాంతియై-దాంతియై ॥

194. అత్యాశ్చర్యకరమ్ముగా విపుల వేదాంతాంబరమ్మేగి, సాం
గత్యమ్మస్థిరతా నిదానములతో గావించి, క్షీణించు దౌ
ర్గత్యమ్మున్ విడనాడి; జాబిలిని, దారా మండలిన్ దాటి, సా
తత్యమ్మైమ్మె విలసిల్లు గాంతిమయ తత్త్వస్థానమున్ జేరెనే! ॥

195.మునిలోకాధిపుడైన దేవఋషి స్వర్భూమిన్ బ్రవేశించి, శా
స్త్ర నిధానమ్మగు దేవ దేశికునితో దత్త్వార్థ వాదోప వా
దనలన్ జేయుచు, మధ్యలో గుపితుడై తాల్మిన్ విసర్జించి, చి
ల్కనుగా జేసెనొ! భూమికిన్ విసరెనో! కాకున్ననిట్లాడునా! ॥

196.కలహ ప్రీతిని నారదుండెవరికో కయ్యమ్ము కల్పించి, వా
రల కొట్లాటను జూచి, నవ్వుకొను వేళన్ వారి తీవ్రాగ్రహ
జ్వలన జ్వాలిక శాపమై, శుక తనూభావంబుతో భూరుహ
మ్ములపై వ్రాలి, వచించుచుండవలె పో! మోక్షార్థ వాక్యార్థముల్ ॥

197.నలువ యొకానొకప్పుడు మనమ్మున మన్మథుడుద్భవించి, తూ
పులు గురిపెట్టి కొట్ట, వలపుల్ చిగురొత్తి సరస్వతిన్ గవుం
గిలి జెఱబట్టి హత్తుకొన గీరము నవ్వులు రువ్వెనేమొ! య
చ్చెలువ శపించెనేమొ! యిట జేరినదేమొ! యనంగ దోచెడిన్ ॥

198.శుక యోగీంద్ర తపఃక్రియా జనిత తేజోరాశి యొక్కుమ్మడిన్
సకలాశాతట యానమున్ జలుపగా సత్యావనీ నాథుడొ
ద్దికగా దీరిచి దిద్దగా జిలుకయై దీపించి, తత్త్వార్థ వి
ద్యకు, బ్రాచుర్యమొసంగ జేరినదిపో! ధాత్రీ మహాప్రాంతమున్ ॥

199.బలిమిన్ బర్వతరాజ పుత్రి తపమున్ బంచాగ్ని మధ్యమ్మునం
జలుపన్, దత్తను తాప శాంతికట వాసంబున్న రాజిల్కా ఱె
క్కలతో వీచినదేమొ! యా సుకృతిచే జ్ఞానమ్మునార్జించి, కొం
దలపాటున్ బడుచున్న జీవులకు బోధల్ సేయగా వచ్చెనో! ॥

200.పచ్చని చీర కట్టుకొని పంటవలంతి మనోహరాంగిగ్నైయి
ముచ్చట గొల్పుచున్న తరి ముద్దుగ శ్రీహరి చేరి, కౌగిటన్
గ్రుచ్చి, రసాబ్ధి డోలికల లోగిలిలో సుఖముండెనేమొ! యీ
పచ్చని చిల్క తత్ప్రణయ భావ ఫలమ్ముగ సంభవించెనో! ॥

201.మది పులకించి పోవునటు మాటికి-మాటికి జీవకోటిలో
గుదురుకొనంగ గ్రొవ్వలపు, కొంటెతనమ్మున బూవుటమ్ములన్
వదలెడు జిత్త జాతునకు వాహనమై; తనరౌతు బూదిగ్నైయి
చెదరుట గాంచి, రక్తిమ నశించి, విరాగిగ మారిపోయెనో! ॥

202.భాగవతమ్ము పల్కుటకు బట్టున జిక్కినవేడు ప్రొద్దులే
యోగికి వ్యాసపుత్రునకు నూరట జెందమినంతమాత్రచే
భోగ మహాసముద్రమున మున్గుచు, జన్మపరంపరా దురు
ద్యోగమునందు జిక్కుకొనుచుండిన జీవుల బ్రోవ వచ్చెనో! ॥

203.సదసద్భావమెఱుంగ శంకరుడు ప్రస్థాన త్రయ క్షీర వా
రిధినిన్ ద్రచ్చి, సుధన్ ముముక్షు జనపాళిన్ బ్రోచి, యందించి, ము
ప్పది రెండేడులె యాయువౌటను మహాప్రస్థానమున్ జేసి, చా
లదు కాలమ్మని యెంచి, కాంచెనొ! పునర్జన్మంబు కీరమ్ముగన్ ॥

204.సోదరులన్ వధించుటలు శోణిత భోజనమారగించుటల్
కాదు సుమా! సుఖమ్మనుచు గాండివమున్ విడనాడు నాడు ని
ష్ఖేద వివేకమిచ్చుటకు గ్రీడికి గృష్ణుడు చేసినట్టి యు
ద్బోధ సజీవమై యిటుల దోచినదో! శుక దేహధారిగ్నైయి ॥

205. వెనుకటి జన్మలో జిలుక బెంచుచు బంజరమందునుంచి, బం
ధనమును గల్గజేసి, ఫలితమ్ముగ 'గోపన' కారవాసమున్
గొని, యదియే తలంచుకొని, కుందుచు గుందుచు గీరజన్మమం
దెనొ! పరమార్థ తత్త్వమును దీరుగ బోధన సేయుచుండెనో! ॥

206. అల సత్యాపతి ప్రేమ జీవుడు కళత్రాభీష్ట సంపూర్తికై
బలిమిన్ స్వర్ధరణీజమున్ బెఱికి, దేవవ్రాతమున్ గెల్చి, యి
య్యిలకున్ దెచ్చిన వేళ దత్తరు గృహంబే వాసమైయున్న రా
జిలుకన్ మెచ్చి, స్పృశించెనో! యదియ వచ్చెన్ గాక బోధింపగన్ ॥

207. జలకములాడుచున్న తరి సారస నేత్రలు గోపికాంగనల్
వలువలు మూట గట్టుకొని, పాదపమెక్కిన జ్ఞాన భాస్కరుం
డెలమిని దైహిక స్పృహ నశింపగ దత్త్వము పల్కువేళనీ
చిలుకయు బ్రక్క కొమ్మపయి జేరినదై చెవులప్పగించెనో! ॥

208. ముద్దులు మూటగట్టునటు ముచ్చటగా బలుకాడుచుండుటల్
కద్దుగదా! శుకమ్ములకు, గాని ముముక్షు జనోచితమ్ములన్
సుద్దుల బల్కుచున్నయది, సూరిజనమ్ములు మెచ్చునట్టులీ
విద్దెలనెట్లు నేర్చెనొ! వివేకమునెట్లు పరిగ్రహించెనో! ॥

209. ఏ గుడి గోపురమ్మున వసించెనొ! యచ్చటి కెందరెందరో
యోగులు వచ్చి, భక్తులకునున్నతముల్ భగవద్విభూతి గా
థా గరిమ ప్రసంగములు తత్పరతన్ బొనరింప వీనులన్
మ్రోగి, ప్రతిధ్వనించి, శుకమున్ ముని సింహముగా రచించెనో! ॥

210. వేదపురాణ శాస్త్ర పదవీ సమలంకృతుడున్, దయార్ద్ర వి
ద్యా దరహాస చంద్రికలనాను జకోరకమెవ్వడేనిన
త్యాదర లీల గాయపడినట్టి శుకమ్ము<ను జేరదీసి స
మ్మోదముతోడ మందులను బూసియు! జ్ఞానినిజేసి, పంపెనో! ఉ॥

211. పలికిన పల్కులన్నియు ప్రబంధములై రసడోలలూచగా
గలుగుట సాజమే యగునుగాని, మహాపరమార్థ మార్మిక
మ్ములను వచించి, యిట్లు పరిపూర్ణ రసాబ్ధి తరంగ డోలికో
చ్చలితుల జేయనెవ్వరికి సాధ్యమగున్ శుకమెట్లు నేర్చెనో! ॥

212. అనుచున్ బరి-పరివిధముల
మనమున దలపోసి-పోసి మహిత రసాల
మ్మును, బికమును దత్కీర
మ్మును బ్రశ్నించినవి పుట్టు-బూర్వోత్తరముల్ ॥

**పిక రసాల ప్రశ్నము :**

213. ఎవ్వతెవీవు? నిక్కము వచింపుము కేవల కీరమిట్లు వా
క్రువ్వ దరంబె! శాస్త్రముల కూడలిలో ధ్వజ ఘంటికా తతుల్
సవ్వడి సేసినట్లు, సురశాఖి లతాంతములొక్కమారుగా
రువ్వి, మరందమున్ జెవులలో వడబోసినయట్టులాడితే ॥

214. ఏపనిపూని వచ్చితివి యీభువికిన్ సురభూమివీడి, యే
శాపము పొంది నీవు శుకజన్మ ధరించితివో వచింపుమీ!
దాపరికమ్ము లేక, భవ తాప నిదాఘమడంచు దొల్కరుల్
నీపలుకుల్ మహాత్ముడవు నీవని చెప్పక చెప్పుచుండెడిన్ ॥

215.అమలోదాత్తముగా గురుండొకడు వేదాంతార్థ విద్యా రహ
స్యములన్ బోధన సేయుచున్న తరిలో జాపల్యమున్ బూని, గ్రం
థము మున్ముందుగ గొంతజూచి, పటు వాద ప్రౌఢి జూపింప గ్రో
ధముతో దేశికుడే శపింపగ శుకత్వమ్మిట్లు ప్రాప్తించెనో! ॥

216.గాఢములైన భావములు కమ్మని మాటల వెల్వరించు నీ
ప్రౌఢికి మేము దాసులము, ప్రాబలుకుం గడలిన్ మథించి, మా
మూఢత వాయగానమృతమున్ జెవులందున నింపితీవు ని
ర్వ్యూఢముగా ద్వదీయ కథయున్ వినిపించి, యనుగ్రహింపవే! ॥

217.గొప్ప విషయమ్ములేకాదు- గొప్పవారి
విషయములు గూడ మిగుల వివేకమొసగి,
బ్రతుకు బాటలో బూవులు పఱుచునంద్రు
కనుక నినుగూర్చి వినెడు భాగ్యమ్మునిమ్ము ॥

218.నీవు ప్రపంచమెల్ల గమనించినయట్లు వచించియుంటివా
భావములందు నీ యనుభవమ్ముల సారము రంగరించి, యా
పై వడబోసి, మా హృదయ పాత్రములందున నింపినట్టి నీ
జీవితమెట్టిదో తెలియజేయుమ! కీరమ! జ్ఞాన సారమా! ॥

219.ప్రాయము చిన్నదయ్యు రసబంధుర వాఙ్నిచయమ్ములల్లి మా
కై యుపదేశమున్ జరిపినట్టి శుకోత్తమ! నీకు దాస్యమున్
జేయుటకంటె భిన్నెములు చేకురునెక్కుడు కార్యమున్నదే!
మా యొడయండవై పలుకుమా! భవదీయ కథా విశేషముల్ ॥

220.నీ పలుకులు వినినంతనె
తాపమ్ములడంగె ద్వత్ కథా మారంద
మ్మాపోల శనముం జేసిన
నీపయి జన్మంబులుండునే! బల్కగదే! ॥

221.ఏ జన్మంబులనాటి పుణ్యఫలమో! యీజన్మలో మోహ మా
యా జాడ్యమ్మునడంపగా గలుగు విద్యావేత్తవై మాకును
త్తేజంబిచ్చితి వాక్సుధా గరిమతో, దేజో మహత్త్వమ్ములో
రేజుక్కల్ గద! నీదు పల్కులిక నీవృత్తాంతమున్ దెల్పవే! ॥

222.అయ్యభ్యర్థనమాలకించి, హృదయాహ్లాదైక వక్తృత్వ వి
ద్యాయోషా చరణారవింద మకరందమ్మాను భృంగమ్మునా
మ్నాయాంతాంబుధి శాయి చింతన కళా మందారమాముష్మిక
శ్రేయస్సాధన మూలమౌ శుకము విన్పెన్ స్వీయ చారిత్రమున్ ॥



***

## 4. శుక చరిత్ర

**ఆలయము – ఆరామము :**

223. సామాన్యంబగునట్టి కీరమునుగా జన్మించితిన్ నిత్యమా
రామంబుల్ గుడి గోపురమ్ములు విహార ప్రాంతముల్, ప్రేమ వి
ద్యామాధుర్య విలోల జీవులకునాస్థానమ్ములారామముల్
వ్యామోహ వ్యతిరిక్త జీవులకు దైవస్థానముల్ వాసముల్ ॥

224. కోవెలలో ఘన ఘంటా
రావము మార్మోగునపుడు ప్రణవము తోచున్
వే వనితల యందెల సడి
తో వనిలో బ్రణయరవము తోచుచునుండున్ ॥

225. గుడిలోపలి యొడయని గని
తడియును గనుగవలు భక్తి తాత్పర్యముచే
నెడదలు ముడివడి కన్నులు
జడివానను గురియు బరవశత్వమున వనిన్ ॥

226. కరములు జోడింతురు దే
వరకున్ బ్రణమిల్లు వేళ భక్తులు గుడిలో
గరములతో బంధింతురు
సరసమ్ములు పండునట్లు జాణలు వనిలో ॥

227.దురితమ్ముల వాయుటకై
పరమాత్మకుఁ మ్రొక్కుచుండ్రు భక్తులు గుడిలో
సరసులు గతమున జేసిన
పొరబాటులు సైపుమనుచు మ్రొక్కుదురు వనిన్ ॥

228.గుడిలోపలి దైవమునకు
ముడుపులనర్పించి, జనము మ్రొక్కుచునుండన్
సడిసేయని తడి ముద్దుల
ముడుపులు గైకొంద్రు పురుష పుంగవులు వనిన్ ॥

229.గుడిలో భక్తులు స్వామికి
మెడలో బూమాలలుంచి మేదుర భక్తిన్
బడి మ్రొక్కుచుండ్రు, పడతుల
జడలందున దుఱుముచుండ్రు సరసులు వనిలో ॥

230.సాష్టాంగ ప్రణతుల్ సమర్పణముగా సర్వేశ్వరున్ మ్రొక్కుచున్
స్వేష్టా పూర్తిని గోరుకొంద్రు గుడిలో; శృంగార రాగక్రియా
పుష్టిన్ గోరుచు జేరుచున్ బడతులన్ భూషించి, సర్వాంగ సం
తుష్టిన్ గోరుచు ముట్టుచుండ్రు వనిలో దోగాడుచున్ గాముకుల్ ॥

231.ప్రణవము నుచ్చరించుచు, శుభంకరమంచు దలంచుచున్ బ్రద
క్షిణములు చేసి, దైవమును గేలుమొగిడ్చి, నమస్కరించు వా
రణకువ జేరుచుండ్రు గుడియందున భక్తులు; రక్తులున్ బ్రద
క్షిణములు సేయుచుండ్రు తమచేడియలన్ గనుగొంటకై వనిన్ ॥

232. గుడిలోగల సర్వేశ్వరు
నడుగులె సాయుజ్యమనుచునంజలి బంధం
బుడుగర సేయగ; బడతుల
యొడియే స్వారాజ్యమనుచునుందురు వనిలో ॥

233. నమ్మి దైవమ్ము, బొర్లి, దండమ్ములిడుచు
మ్రొక్కుచుందురు దేవళమ్ములకు బోయి;
పడతులను జేరి, మెల్లగా నొడిసి పట్టి,
దొర్లి, పొర్లుచు మురిపింత్రు తోటలందు ॥

234. యోగులు రామాలయమున
యాగార్చన సేయుచుందురనవరతమ్మున్
భోగులు రామలకై యను
రాగార్చన సేయుచుందురారామములో ॥

235. తరణోపాయము కోరుకొంచు గుడిలో దైవార్చనా రక్తులై
వరివస్యల్ పొనరించుచుంద్రు సతమున్ భక్తాగ్రగణ్యుల్; వనిన్
దరుణీ ప్రాయము కోరుకొంచునొడిలో దల్లోకమే నాకమై
సరసాలాపములాడుచుంద్రు రసికుల్ సౌందర్య సేవారతుల్ ॥

236. పరమానందము తోడ జేరెదరు దైవస్థానమున్ మ్రొక్కగా
ధరణీజాపతినిన్, చతుర్థ పురుషార్థమ్మే ప్రధానమ్ముగన్
సరసావేశముతోడ జేరెదరు నిచ్చల్ పుష్పితోద్యానముల్
తరుణీ సంగతికై, తృతీయ పురుషార్థమ్మే ప్రధానమ్ముగన్ ॥

237.ధరణీజాపతి పాదపద్మముల చెంతన్ భక్తి సామ్రాజ్య భా
సురమైనట్టిది వానరమ్ము కనవచ్చున్; బుష్పవాటీ స్థలిన్
దరుణీ క్షీరధరాచల ద్వయము పొంతన్ రక్తి సామ్రాజ్య బం
ధురమై మానస వానరమ్ము పలుచిందుల్ త్రొక్కుచున్ జొక్కెడిన్ ॥

238.కువలయజాపతి సేవలు
రవి పొడువక మున్నె దేవళమ్మున గలుగన్
గువలయ నేత్రల సేవలు
రవి గ్రుంకక మున్నె వనములన్ సమకూరున్ ॥

239.వానరమొక యూతయగా
బూనికమై వార్ధి దాటె భూజాపతి యీ
మానస వానరమూతగ
బూనిక బ్రణయాబ్ధి రసిక పుంగవుడీదున్ ॥

240.ఒక యలుగునొక్క పలుకును
నొక పొలతిగ సతము రాముడుండగ; దామొ
క్కొక జిలుగొక్కొక కులుకొ
క్కొక పొలతిగ రేపు-మాపునుందురు రసికుల్ ॥

241.భగవద్గీతా గానం
బగణితముగ వినగవచ్చునాలయమందున్
సొగసులతో సుమ వనిలో
వగలొలికెడి యుగళగీత వైభవమెసగున్ ॥

242. వేదమ్ములు, శాస్త్రమ్ముల
వాదమ్ములు దేవళమున బండును; రసికో
న్మాదమ్ములు, వాత్స్యాయన
నాదమ్ములు పండు వలపు నాటిన వనిలో ॥

243. ప్రాణాయామము కొఱకై
పూనిక మైదాల్చి ముక్కు మూయుదురు గుడిన్
బ్రాణోద్దీపన కొఱకై
పూనిక ముద్దాడ బెదవి మూయుదురు వనిన్ ॥

244. ఫలవంతము రాముని ముం
గిలియే యని భక్తజనులు క్రీడింత్రు గుడిన్
గిలిగింతల గని చెలి చె
క్కిలియే యని రసిక జనులు క్రీడింత్రు వనిన్ ॥

245. ఆమనిలో శ్రీరామా
రామములో బెక్కు సంబరమ్ములు; రామా
రామములో బ్రతి ఋతువును
నామనియై సంబరమ్ములంబరమంటున్ ॥

246. ప్రాయమ్మెల్ల గతింపకుండగనె శ్రీరామార్చనల్ సల్పుటల్
శ్రేయమ్మంచును ఘంటికా నినదముల్ చెప్పున్ గుడిన్; బెద్దగా
నాయుస్సున్నను బ్రాయముండదుగదా! యాప్రాయమే కామ ధౌ
రేయమ్మంచు వనిన్ వచించు బ్రియనారీ పాద శింజానముల్ ॥

247.రసమను మాటకర్థము పరాత్పరుడంచు గ్రహించి, తత్త్వ సా
రస మకరంద పాన గుణరాజితులాలయ భూమికేగుచో
రసమను మాటకర్థము పొలంతుల కౌగిళులంచునెంచుచున్
రసిక జనాభిరామలగు రామల గూడుదురా వనీస్థలిన్ ॥

248.దేవళమునకున్ దివ్వెలు
కావలయును వెలుగుకొఱకు- గాంతల కనులే
వే వెలుగుల గనులనుచున్
భావింతురు రసిక జనులు వన వాటికలన్ ॥

249.సారవిహీన సంస్మృతి విచారము వీడి, పవిత్ర వాక్సుధా
సారము గోరి, భక్త తతి సారెకు-సారెకు రామ సన్నిధిన్
జేరెదరైహలౌకిక విశేషములన్ దనివోవువారు సం
సారము మెచ్చి, చేరెదరు సారెకు-సారెకు రామ సన్నిధిన్ ॥

250.రుచియొక రామ నామమున రూఢిగనున్నదటంచు నమ్ముచున్
రుచిరములైన కీర్తనల లోగిలియంచు దలంత్రు కోవెలన్
రుచి తన రామ దేహమున రూఢిగనున్నదటంచు నమ్ముచున్
కచ-కుచ వర్ణనల్ సలుపగా సమకట్టుదురా వనీస్థలిన్ ॥

251.శ్రుతులిష్టంబుగ దైవతాంగణములో జూపట్టుచో, మానినీ
గతులిష్టంబుగ బుష్పవాటికలలో గన్పట్టు, రామార్చనాం
చితమౌ జన్మము ధన్యమంచు గుడిలోజింతింప, రామా కరా
ర్చితమౌ దేహము ధన్యమంచు వనిలో జింతింతురెవ్వేళలన్ ॥

252.పవమాన సుతుడు రామున
కవిరళముగ సేవ జేయునా కోవెలలో;
పవమానుండే జంటల
కవిరళముగ సేవ జేయునారామములో ॥

253.అతి భక్తితోడ రాముని
కతలన్ వినుచుండునొక్క కపి యాలయమం
దతి రక్తితోడ గాముని
కతలన్ గల్పించు బెక్కు కపులా వనిలో ॥

254.ముచ్చట జేరుచుందురు ముముక్షు జనమ్ములు రామ మందిరం
బచ్చటి యా ప్రశాంతతకునాదటవోవుచునుందురెప్పుడున్
ముచ్చట జేరుచుందురు విమోహ జనమ్ములు కామమందిరం
బచ్చటి పారవశ్యమునకాదట వోవుచునుందురెప్పుడున్ ॥

255.హృదయమ్మె శ్రీరాముని
సదనమ్మై దేవళమున సందడి సేయున్
హృదయము స్వకీయ రామా
సదనమ్మై కామ వనిని సందడి సేయున్ ॥

256.ధర్మాత్ముడు శ్రీరాముడు
ధర్మము సంధింప నారి తనదరి చేరున్
ధర్మమ్మును వీడిన దు
ష్కర్ముండగు వాడు నారి చాటున జేరున్ ॥

257. దేవాలయమే భక్తుల
కావాసమ్మగుట జేసి యటనుండుటయే
జీవన సౌభాగ్యమ్మని
భావించితి గోపురమున వాసమ్ముంటిన్ ॥

**రామాలయము :**

258. అను నిత్యమ్మను భక్త శేఖరులు దివ్యానంద సంధాయి రా
ముని దర్శించి, తదంఘ్రులన్ దడుముచున్, బూజించుచున్, బెక్కు క
మ్మని గీతమ్ములనాలపించెదరు, తన్మాధుర్య లీలామృత
మ్మును సేవించుచు బ్రొద్దు పుచ్చునెడ స్వర్భోగమ్ములాశింతుమే! ॥

259. గల-గల నవ్వు క్రొవ్విరుల కమ్మని తేనియలారగించి, మ
త్తిలి నిదురించు దుమ్మెదలు దేవర సేవకు వచ్చునట్టి భ
క్తుల సడి మేలుగాంచి, రొదతో వినువీథికి జేరు వేళలో
గలిగిన నాదముల్ ప్రణవ గానముగా వినిపించునచ్చటన్ ॥

260. తెల-తెలవారకుండగనె దేవర సేవకు భక్త సంతతుల్
బిల-బిలమంచు జేరుకొను వేళల లే జవరాండ్ర కాలి యం
దెల చిఱుగంట మ్రోతవిని, దేవళమందలి పెద్దగంటకున్
గలిగిన పిల్లగంటలివి కాదగునా! యనుకొందురందరున్ ॥

261. తిరునామమ్ములు తీర్చి దిద్దుకొని, వందే! పాహిమామంచు ద
చ్చరణమ్ముల్ స్పృశియింత్రు వైష్ణవులు; కచ్చాకట్టులున్ బైడి ముం
గరలున్, గుండ్రని బొట్టులున్ గలుగు వాల్గంటుల్ విరుల్ గట్టుచున్
సరులన్ గూర్చి, యలంకరించెదరు భూజా జానినిన్ వేకువన్ ॥

262.కోవెల చేరు గోమలుల కొప్పులలో గల మల్లెపూలు నె
త్తావులు గుప్పుచున్ బలుకు, ధర్మము వీడని వారి చిత్తముల్
మావలె స్వచ్ఛమై, జనులు మన్ననతో దలకెత్తుకొంచు, సం
భావన సేయగా దగిన భాగ్యమునందునటంచునచ్చటన్ ॥

263.రసగంగాధరమున్ బఠించినను సారస్యమ్ము చేకురునా!
రసవంతమ్మగు సారసమ్మెడదరైయె రంజిల్లి, నిత్యమ్ము సం
తసమున్ లోకులకంద జేయగల తత్త్వస్ఫూర్తి మీగుండెలో
మసలంగావలెనంచు రామపద పద్మమ్ముల్ వచించున్ గుడిన్ ॥

**ఆలయ ప్రాకారము :**

264.సారతరమ్ముగా బ్రదుకు చక్కగ సాగు బవిత్ర ధర్మ సం
స్కార గుణమ్ము చుట్టబడగా, గుడి గుండియలోన భక్త మం
దారుడు వాసముండు నిరతమ్ము నిజమ్మని పల్కు బెద్ద ప్రా
కారము దేవళమ్మునకు గట్టిన పుత్తడి కోట గోడయై ॥

265.ఆ ప్రాకారమనూనమై నిలచు శ్రేయస్సాధనంబైన వే
ద ప్రామాణ్యము చుట్టునుం దిరుగు శాస్త్ర వ్రాతమై; శాస్త్ర వి
ద్యాప్రాధాన్యము చుట్టునుం దిరుగు భాష్యవ్రాతమై; రామ రా
జ్య ప్రాశస్త్యపుటున్నతిన్ దెలుపునట్లాకాశమున్ దాకుచున్ ॥

266.విప్రుల్ చేసెడి వేదనాద చయముల్, వేదార్థ శాస్త్రార్థ వా
ద ప్రౌఢుల్, స్మృతులున్, బురాణములు, ప్రస్థాన త్రయ వ్యాఖ్యలున్
గప్రంపున్ గనులౌ కవిత్వములనాకర్ణించి, పెక్కేండ్లుగా
నాప్రాకారము గాంచి యుండవలె దివ్యమ్మైన యౌన్నత్యమున్ ॥

267.ఔర! ప్రాకారమాకాశమంటుచున్న
దాని తలపైని గలయంచు ధరణి జూచు
నెంత యెత్తునకెదిగిననేమి గాని
మొదలి చేయూత మఱువ రానిది యటంచు ॥

268.వేద భారతి శీర్షమై వెలుగునట్టి
యుపనిషద్వాఙ్మయమ్మునానున్నతముగ
గుదురుకొనియున్న ప్రాకార కుడ్యమునకు
బైని దలయంచు ఛత్రమ్ము భాతినొప్పు ॥

269.తనపై నిద్దురసేయు వెన్నుడగుటన్ ధాత్రీసుతా భర్త, మా
నని భక్తిన్ వరివస్య సేయుటకనంత స్వామి వేడ్కన్ ఘనా
ఘన వర్ణాంచిత రామచంద్రునకు భోగ చ్ఛత్రమున్ బట్టెనం
చును భావింతురు చుట్టుగోడ తలయంచున్ జూచువారెల్లరున్ ॥

**శుకీ పరిచయము :**

270.ఆయంచు పైని వ్రాలుచు
బ్రాయము గల పెంటి చిలుక వాకొనుచుండున్
దీయని విరితేనెల కొలు
వై యుండినయట్లు దాని యాస్యంబెల్లన్ ॥

271. మందాకినీ నదీ మధుర వీచీ పంక్తి
యుయ్యేలమై తమ్మిమూచినట్లు
నూగు బంగరు తమ్మినుండు దీయని తేనె
జాలు క్రిందికి గొంత జారినట్లు
జారుచుండిన తేనె జాలునానుటకునై
తుమ్మెదల్ ఱెక్కలన్ దులిపినట్లు
గండు తుమ్మెదల ఱెక్కల గాలికిన్ దేనె
త్రైవిష్టప స్త్రీల దాకినట్లు
పడతులా తేనె చిన్కులన్ దుడుచుకొనగ
చేతి గాజులు సవ్వడి చేసినట్లు
చిలుక పల్కాడుచో ముద్దులొలుకుచుండు
బరవశమ్మున నాయెద పండుచుండు ॥

272. చల్లని పిల్ల తెమ్మెరల సందడికిన్ బులకించి పోవుచున్
ద్రుళ్ళుచునున్న సస్వరమతో బ్రణయమ్మొనరించు మేఘుడున్
జల్లులు కాన్క వెట్టి, సరసమ్ముల సవ్వడి చేసినట్లుగా
నుల్లము రంజిలన్ బలుకుచుండును జిల్క వరాల మొల్కయై ॥

273. కొమ్మలు రసాల తరువుల
కొమ్మలకూయలలు గట్టుకొని యూగెడు నా
డిమ్మగు జడ గంటల నిన
దమ్మువలెన్ బలుకు జిలుక తలపుల తళుకై ॥

274. చెంగు-చెంగున దమతల్లి చెంత జేరి
గుమ్మ పాలకై పొదువులన్ గుమ్మునాడు
లేగ దూడల మెడలందు మ్రోగు చుండు
నలతి మువ్వల రవళినా జిలుక పలుకు ॥

275.బంగరు మొలత్రాడునకున్
సింగారము రూపుగట్టు చిఱు గంటలు మ్రో
గంగా బసి బిడ్డడు న
వ్వం గలిగిన రవళి చిలుక పలుకుల దోచున్ ॥

276.గోదావరి తరగలు స
మ్మోదముతో బడవతోడ ముచ్చటలాడన్
మేదురముగ వినిపించెడి
నాదమ్ముగ దోచు జిలుక నవ్విన వేళన్ ॥

277.సాగర తీరానిలములు
సాగించెడి సేవలకును సరుగుడు మొక్కల్
తూగుచు జేసెడి నృత్యము
లోగల సడి చిల్క నగవులో గనుపట్టున్ ॥

278.అట్ల తద్దికి గన్నె ముచ్చట్ల తోడ
నలతి యూయెలనెక్కి తూగాడు నాడు
చిన్నబెదరుచే మేను గుచించి, జారి
పడెడునందియ రవళినా బలుకు జిలుక ॥

279.బంగరు పిల్ల గ్రోవిపయి బాటలు పాడుచునాటలాడు గో
పాంగన తోడ గాల్ కలిపి, యామె మనోహరమైన మోవినా
నం గమకింప, సిగ్గున, వినమ్రతగా దన చేయినడ్డు వె
ట్టం గదలాడు వంశి నొసటం గల గంటిక వోలె బల్కెడున్ ॥

280.కడవ లోని పాలు త్రాగి, పొంగెడు వేళ
కలుగుచున్న సడికి జెలిమి కలిమి
చిలుక పలుకులందు గలుగుచుండుట జేసి
దాని తోడ నాకు దవిలె మైత్రి ॥

**శుక ప్రణయము :**

281.మా చెలిమి ప్రేమ బంధ
మ్మై చెలువొందినది, వలపుటారామములో
బూచిన పూవుల తేనెకు
నోచుట యెట్టిదియొ నుడువ నుడులుం గలవే! ॥

282.నగవుల వానలో దడిసినన్ రసరమ్య మనోజ్ఞ గీతిగా
పగలను మున్గినన్ వలపు వాకిట ముచ్చట రంగ వల్లిపై
సొగసుల గజ్జె కట్టుకొని, సోముని పందిరి క్రిందనాడుచున్
జగతిని విస్మరించినను జాలివడిన్ గొనమైతిమెన్నడున్ ॥

283.ఒక మాట యొక్క పాటయు
నొక యాటయునొక్క బాట యుండును గానీ,
యొకనాడును ద్వైత స్థితి
ప్రకటింపదు జంట ప్రణయ బంధుర గరిమన్ ॥

284.కనులే యమ్ముల పొదులై
నను జూచిన చూపులెల్ల నారాచములై
మనమున నాటుచునుండును
సునిశితముగనయ్యు మిగుల సుఖమే యొసగున్ ॥

285. కోరికల త్రాటితో గుండె కొండ చుట్టి
వలపు మున్నీట నిలబెట్టి, చిలికి-చిలికి,
పడసినారము మేము దాంపత్య సుధను
గూర్మి పేరిమి బలుమార్లు గ్రోలినాము ॥

286. కనులన్ గాంచిన జాలు నా యెడదలో గవ్వింతలై, మేను గాం
చిన పుల్కల్ సహజాత భూషణములై చెల్వొందుచున్, గౌగిలిం
తను నేగానుక వెట్ట, గ్రుచ్చి గిలిగింతల్ పెట్టుచో దాను నొ
చ్చునటంచున్ వెనుకాడ దానె మురిపించున్ గౌగిటన్ గ్రుచ్చుచున్ ॥

287. పలికిన జాలు నా హృదయ భాండమునందమృతమ్ము నింపి, కొ
వ్వలపు సుగంధముల్ జొనిపి, పంచ సుమాస్త్రుని తత్త్వమగ్నిగా
నిలుపుచు వంట జేసి, యది నేర్పున గ్రోలుచు ద్రేన్చినట్టులిం
పులు తళుకొత్తు, నాకొఱకు బూచిన పూలు శుకీ విలాసముల్ ॥

288. అలతి-యలంతి అెక్కలనొయారముగా విదలించి, గాలిమొ
ల్కలను సృజించెనేని వలరాజు రగిల్చిన భీషణాగ్ని కీ
లలకుపశాంతి, భవ్య రసరమ్య పవిత్ర మనః ప్రబంధ స
ర్గలకొక క్రొత్త కాంతి యొనరన్ గిలికించితముల్ జనించెడిన్ ॥

289. ఆడినదాటగ బాడిన బాటగనామనులన్నియు మావియగా
జేడియ నాదరి చేరిన వేళల జిత్రములౌ రస వాహినులే
పోడిమిగా బ్రవహించుచు, మించుచు, ముంచుటలే, మురిపించుటలే
వాడి మయూఖములైనను వెన్నెల వాకిళులన్ మరపించుటలే ॥

290.గిరులన్ జేరి, తదీయ కందరములన్ గ్రీడించి, యందున్న ని
ర్ఝరులన్ స్నానములాడి, యోషధుల సారమ్మెల్ల భక్షించి, ని
ద్దురవో స్వాప్నిక లోకమందునవియే తోచున్ విహారమ్ముల
ద్దిర! నిద్రించుట-మేలుకొంట యొకటే తీరయ్యె మాజంటకున్ ॥

291.వనముల్ చేరి, నికుంజ మందిర సమాహ్వానంబు మన్నించి, రా
లిన పూలన్నియు శయ్యగానమరుచో గ్రీడించి, నిద్రించి, మే
ల్కొని, భూజమ్ములు మమ్ము మెచ్చుకొని, మాకున్ గాన్కగా దోర ప్రము
గ్గిన పండ్లిచ్చిననారగింతుమమృతాకీర్ణమ్ము దాంపత్యమై ॥

292.పవలున్ రేలును రేపు- మాపులును జూపన్ రావు క్రీడింపగా
నవధుల్ లేవు, మొగమ్ము మొత్తుటలు లేవానంద వారాశి సం
భవ చింతామణి మాకొసంగని రసైశ్వర్యమ్ములున్ లేవు, చెం
దొవ ఱేడుండని రాత్రులున్ బ్రణయ మందున్ లేవు పెంజీకటుల్ ॥

293.చలిలో గౌగిలి బంధ
మ్ములతోడన్ వెచ్చదనము పొందుచు, గాకల్
కలిగిన కాలమ్మున జా
పులతోడన్ జల్లదనము పొందెదమెపుడున్ ॥

294.ఒకరి ఱెక్కలలో మఱియొకరి తలను
దాచుకొందుము వానలో దడియకుండ
గాలమేరీతి శాసింప గలదు మమ్ము
బ్రణయ సామ్రాజ్యమెల్లనేల్బడియ మాకు ॥

295.కాలము సాగుచున్నది సుఖంబులొసంగుచు ముచ్చటించుచున్
హేలగ మాదు జీవనమహీన రసాబ్ధి తరంగ మాలికా
డోలలనూగుచో గనబడున్ జగమెల్ల మనోజ్ఞ మాధురీ
శాలగ, రాసలీలకు బ్రశస్త మనోభవ దత్త వేదిగన్ ॥

296.పవమానాశనమౌచు గాలమొకచో వర్తిల్ల నాగస్వరం
బవుచున్ మా ప్రణయమ్ము భోగములతోనాటాడు, దానాతపం
బవుచో బంధము ఛత్రమై నిలచు దా హాలాహల ప్రఖ్యమై
తవులన్- బ్రేమసుధా విశేషమునకున్ దాస్యమ్ము చేయించెడిన్ ॥

**శుక బంధనము :**

297.ప్రణయ బంధమ్ము శాసింప వలను పడని
కాలమొకనాడు స్వేచ్ఛపై గన్నువేసె
అాతి గుండె గలట్టి కిరాతుడొకడు
రట్టు సేయక వలవేసి, పట్టుకొనియె ॥

298.తనువెల్లన్ గనులున్న దేవపతి, జేతన్ వజ్రమున్ బూని దు
ర్దనుజ వ్రాతము గూల్చు, బాడు వలయేలా! దుర్బలమ్మైన ప
క్షి నికాయమ్మును బట్టుచున్, మృగయునిన్ సేవించుచున్, జీవహిం
సను బ్రేరేపణ సేయునో! యముని పాశమ్మేగదా! జాలమున్ ॥

299.దారమునుండి పుట్టియునుదారత నోచక, ప్రాణిలోక సం
హారము చేయుచుండును దయాపరతంత్ర గుణమ్ములేని యా
దారుణ కాలపాశ సమతన్ భజియించెడి జాల్మ జాలమున్
వారణ చేయ జాలము, ధ్రువంబుగ ఘోరమకృత్యజాలమున్ ॥

300. ప్రణయ స్నేహమునందు మైమఱచి, నిద్రం జెందుచున్నప్పుడా
ఘనిలో వచ్చిన బెట్టిదంపు బిడుగై మామేనిపై వచ్చి వ్రా
లినదా జాలము, మేము జాలమిక వర్ణింపంగ దత్కాల సం
జనిత ప్రాణ భయమ్ము, కాలమటులన్ శాసించె రాకాసియై ॥

301. నల్లని దేహమున్, బొగరు నాటిన కన్నులునుక్కు కండలున్,
ద్రుళ్ళుచునున్న పాదములు, రోకటికిన్ బదులిచ్చు బాహువుల్,
బల్లిదమైన గుండె, చెడబారిన వాతెర, బండ ముక్కు, మ
త్తిల్లియు, బోయ రక్కసుడు తేలికగా జెఱబట్టు బ్రాణులన్ ॥

302. వాని కంటిలో బడనంత వఱకె ప్రాణి
ప్రాణవంతమ్ముగానలరారుచుండు
గంట బడెనేని దప్పించుకొంట కల్ల
క్రూర మృగమేనినాతడ ఘోరుడగుట ॥

303. ఆతని కంటి మంటలకునాహుతియైనవి యెన్ని జీవులో!
యాతని చేతి దెబ్బతిని ప్రాణము వీడినవెన్ని ప్రాణులో!
యాతని కాలి త్రొక్కిడి హతాసువులైనవి యెన్ని దేహులో!
యాతడు మృత్యుదేవతకునౌరస పుత్రుడొ! దత్త పుత్రుడో! ॥

304. సారె-సారెకు బచ్చి మాంసమ్ము దినుచు
గండలను బెంచుకొన్నట్టి దుండగీడు
కనికరము, వేడి నెత్రు దాకని కరమ్ము
లేదు-వేటలో వెనుకంజ లేదు తనకు ॥

305. అడుగున్ బెట్టిన జాలునావనమె హాహాకారమున్ జేయు స
వ్వడి విన్పించును, బక్షులన్నియు భయ భ్రాంతమ్ములై పెద్ద సం
దడి సృష్టించు, మృగమ్ములన్నియును నానా దిక్కులం బట్టుచున్
వడికర్థమ్మును జెప్పుచున్ బరుగిడున్, వ్యాధుండు సామాన్యుడే! ॥

306. కమ్మరి చేయనట్టి చురకత్తులు కన్నులు, చూచినంత ప్రా
ణమ్ము హరింపగా; బొగ కనంబడకుండగ మండునగ్ని గో
ళమ్ములు, విస్ఫులింగ కణరాజి దెసల్ విరజిమ్ముకొంచు ద
గ్ధమ్మొనరింపగా; గఱడు కట్టిన గుండెకు వేట యాటయే ॥

307. వింటిని జేత బట్టుకొని, భీకర రూపముతోడ మృత్యువా
వెంటనె తోడురా బరుగు బెట్టుట, యాగుట, చాటు-మాటు దా
గుంటయు, గెంతుచుంట, వలనుంచుట, గోతులు త్రవ్వుచుంట; గై
కొంటకు బొట్టికూడు, పడగొట్టును బ్రాణుల గోటి విద్యలన్ ॥

308. మచ్చునకేని జాలి తన మానసమందున లేకయుండుటన్
మచ్చును బెట్టి, ప్రాకుగమి మాటున ప్రుచ్చిలి, జంతుజాలమా
యుచ్చున జిక్కుకొన్నపుడొహో! యని గెంతుచు, మాటి-మాటికిన్
బిచ్చిగ నవ్వుచుండు బర వేదన వానికి మోద మూలమై ॥

309. నడగొండ వంటి యేన్గులు
నడి వనమున గుంపుగట్టి నడచెడు వేళన్
సడిలేక మచ్చు వెట్టుచు
బడగొట్టును గోతులందు వ్యాధుడదయుడై ॥

310.భీకర సూకరమ్ములును, బెద్దపులుల్, మృగరాజముల్, వనా
నేకపముల్ మహాటవి జనించిన యగ్నికినందకుండగా
బోకలు నేర్చి; వ్యాధుని యమోఘతరాశుగ వర్ష ధారకున్
మోకరిలున్, జలమ్ము మునుముందు జనించినదౌట భక్తిమై

311.దెబ్బకు దెబ్బను దీసెడి
బెబ్బులియును వేటగాడు విల్లెక్కిడినన్
నిబ్బరమును గోల్పోవుచు
గొబ్బున బ్రాణములు విడచి, కూలున్ నేలన్ ॥

312.పూరిన్ మేయదటంచు సింగములకున్ బేరున్నదేగాని, య
య్యారే! తీవ్ర కర ప్రముక్త విశిఖ వ్యాఘాతమున్ జేసి, వి
స్తారంబైన పరాక్రమమ్ముపుడదృశ్యంబౌట హాహాకృతి
ప్రారంభమ్మొనరించి, పూరి గఱచున్, వ్యాధుండు సామాన్యుడే ॥

313.అమ్ముల వానలోనడవి యంతయు ముంచుచునున్న కాల మే
ఘమ్ముగుచుండు వ్యాధుడు, వికావికలై పరువెత్తు జంతు జా
లమ్మునకూపిరాడదు, జల ప్రళయమ్ము యుగాంతమందు లో
కమ్మును ముంచునట్టులొడిగట్టును బాపశరాంబు పాతముల్ ॥

314.క్రూర మృగమ్ముల మాంసా
హారులకై యమ్మి, పైకమందుచునుండున్
గీరమ్ముల బెంచుకొనం
గోరు జనమ్ములకునమ్ముకొనుచున్ బ్రదుకున్ ॥

315. అది మా భాగ్య విశేషము
గద! దైవమ్మొందమయిన కాయము, పలుకుల్
గదియన్ జేయుటచేతన్
బ్రదుకన్ గలిగితిమి వాని వలలో బడియున్ ॥

316. గుడి సేవించిన పున్నెం
బుడుగరవై బ్రదుకనిచ్చెనో! ప్రణయమునన్
గుడి విడనాడిన పాపం
బిడుమలకున్ మూలమగుచునిటు జిక్కితిమో! ॥

317. గుడియందున్ భగవద్విభూతిమయుడై కొల్వున్న కోదండ రా
ముడు మాకండగనున్న వాడనుచు సమ్మోదమ్ముతో భక్తులి
చ్చెడు బండ్లన్ భుజియించి, జీవితము నిశ్చింతామయమ్మంచు నెం
చెడు బ్రొద్దుల్ చెడు ప్రొద్దులైనవి విసర్జింపన్ దదావాసమున్ ॥

318. స్వైర విహారము చేసెడి
వారము ప్రణయమ్మునందు బడి, గుడి విడుచున్
జేరితిమారామమ్ములు
కారడవులనచటనుండి కాలూనితిమే! ॥

319. కలూనిన మా వెన్కనె
కాలుడు కాలూనెనేమొ! కాలము జాలం
బై లావునణచనేమో!
యేలా! యాసలకు బోతిమిటు చిక్కువడన్ ॥

320. వల గాదది మా యాశల
వలయమ్మె కాళ్ళు గట్టి, పడవైచె సుఖం
బులకుం బారంబున్నదె!
కలిగిన వాసమును విడువగా దగదు గదా! ॥

321. ప్రణయ విహారమున్ జలుపు వారికి జేటులు గానరావు, జృం
భణముగ సాగిపోవునెడ వారికి జోటులు కానియట్టి ప్రాం
గణములు గానరావు, తమ కంటికి నచ్చిన తావులందు దో
రణములు కట్టి, పంచశర రాజ్యమునేలుచునుందురెప్పుడున్ ॥

322. వలపుల కులుకులకున్ గుడి
తలుపులుబిగియించునన్న తలపులతో నా
వలకున్ వచ్చుట, మాయల
వలలో బడి చిక్కుకొనుచు బలవించుటకే! ॥

323. క్రొత్త తావులందు గ్రొందావులన్ గోరు
కొనుచునుండు బాడు మనసు మిడుత
వెలుగు జాలదనుచు వెఱ్ఱెత్తి కోర్కెల
యగ్గి ముట్టుకొనును బుగ్గియగును ॥

324. గుడియును, గుడిలోపలి రా
ముడు, తత్సేవయును మొగము మొత్తుట, వలపుం
జడివాన గురియు గాముని
గుడియగునారామమొకటి గూడుగ మారెన్ ॥

**ఆరామము :**

325.ఆరామము జీవన కా
సారమ్మును, బ్రణయ జలజ సారము, పడుచుం
గోరికలకు తేనెల యా
సారమ్మును బుష్ప శరుని సంసారమ్మున్ ॥

326.మృదు కర కంకణ స్వనము మేదుర నూపుర నిస్వనమ్ములున్
ముదముననాలకించి, కుజముల్ పులకల్ మొలకెత్తగా దలల్
గదుపుచు భామినీ తతికి గానుకగా గయిసేయు బుష్ప సం
పదలను; గండు తుమ్మెదలు స్వాగత గీతికలాలపింపగన్ ॥

327.రాలుచునున్న గ్రొవ్విరులలంతిగ దేనెలుచిల్కరించి, గాం
తా లలితాస్యముల్ తడుపు, దత్కృత సత్కృతికిన్ రహించి, యా
పూలను నెత్తికెత్తుకొని, ముచ్చటగా దరహాస చంద్రికా
జాలమనుగ్రహింత్రు ప్రతి సత్కృతిగా లలనల్ వనావనిన్ ॥

328.కమ్మగ జుంజుమ్మను నా
దమ్ములు పురుడింప భృంగ తతియున్ దద్గీ
తమ్ములకున్ సరియగు దా
ళమ్ములు వినిపించు నచటి లలనల యందెల్ ॥

329.సొగసులకాటపట్టగుచు జూపరు గుండెలు పిండివైచుచున్
వగలొలికించునంగనల వాతెరపై విరితేనె చుక్క చిం
దగ, మగలాని, క్రొత్తరుచి తార్కొనుటం బులకించి, కౌగిలిం
పగ, గనుదోయితో దరుల మన్నన సేయుదురా నెలంతలున్ ॥

330.సారస నేత్రలునటులే
సారస వదనలును హృదయ సారసములతో
నారామము జేరుచు, గా
పారమ్ముగ మార్చుచుంద్రు సరసులు జతగా ॥

331.కనుగవయందు మన్మథుడు కాపురముండుటజేసి, నిద్ర ప
ట్టని యెలప్రాయమౌట, బగడమ్ముల జాబిలివోలెనున్న మో
మునుగని, యల్క జెందె బువుబోడి యటంచు భయమ్ము
పెంపునన్
బనివడి వేడుకొంద్రు చెలి పాదములంటుచు గడ్డమంటుచున్ ॥

332.నచ్చిన చెలి నులి వెచ్చని
ముచ్చట్లకు నోచు జన్మమును మెచ్చుటకై
వచ్చిన మరునకు దూపుల
నిచ్చునటుల్ తరులు గురియునెపుడున్ విరులన్ ॥

333.తరువుల జుట్టుచు లతికలు
విరబూచిన విరులతోడ వేడ్కనొసంగున్
తరుణుల జుట్టుదురు ప్రియుల్
విరబూచిన యెదలతోడ వేడ్కన్ గాంచన్ ॥

334.కనుబొమలే తన ధనువులు
ఘన నీలాలకల యళులె కార్ముక గుణముల్
కను దమ్ములె యస్త్రమ్ములు
మనసిజుడారామమందు మసలును జోడై ॥

335. జంటలకున్ గ్రొవ్వలపుల
పంటయగా, జలివెలుంగు పందిరిగా, బూ
వింటికినావాసముగా
నుంట దదారామమందె యుంటిమి మేమున్ ॥

336. క్రొత్త వింతయౌచు గూర్మి సంబరమౌచు
నెన్నినాళులుండునెవరికైన
కొంత కాలమునకు గ్రొత్త ప్రాతగ మారె
మరొక తావుపైకి మనసు పోయె ॥

**మనసు :**

337. మానసమొక్క వానర సమానముగా బడిగెంతుగాని యెం
దేని సుఖమ్ముగా నిలచునే! సతమున్ జపలత్వమొక్కటే
గాని, మరొండెఱుంగదు, వికారములో పదివేలు, దానికిన్
బానిసలైన వారి తలవ్రాతలు మార్చెడి ధాత కల్గునే! ॥

338. మానసమొక్క భూతము ప్రమాదములన్ గలిగించుచుండుటే
గాని, ప్రమోదమున్ గొనుటకై తగు మార్గము చూపదెన్నడున్
మానితముల్ నడంతలను మన్నన సేయదు సార్వకాలిక
జ్ఞానము త్రోసిరాజనును స్వైర విహారములిచ్చమెచ్చుచున్ ॥

339. నిలబడి నీళ్ళుత్రాగుటకు నేర్వక గ్రుక్కెడు పాలకోసమై
విల-విలలాడుచున్, బరుగు బెట్టుచు బెట్టుచు, డస్సిపోయి, సా
గిలబడి, యాసలెల్ల దలక్రిందయి, యప్పుడు నీళ్ళకోసమై
చెలమలు త్రవ్వి నట్లగును జిత్త వికారములావహించుచో॥

340. మనమునకున్ నిలుకడ లే
కునికిన్ గల సుఖము లెల్లనుదధిని గురియుం
జినుకులవలెనడవిని గా
చిన వెన్నెల వెలుగువలెను జెడు నిష్ఫలమై॥

**కాంతార ప్రవేశము :**

341. ఆనందాబ్ధి తరంగ మాలికలనొయ్యారమ్ముగానూగుచున్
నేనున్ నా చెలియున్ సుఖించితిమి గానీ, చిన్న యారామమే
యానందంబిటులిచ్చుచో నడవియందంతుండునే యంచును
ద్యానమ్మున్ విడనాడి, పోయితిమి కాంతారమ్ము మోదమ్మునన్ ॥

342. సాగినయంత కాలమును సాగును, గల్గిన నంతకాల దు
ర్యోగము త్రాడు పామగుచు హుంకృతి సేయుచు గాటువేయు; స
ద్యోగము గల్గుచో భుజగముజ్జ్వల హారముగా జెలంగు దై
వీ గతినడ్డువెట్టగల విద్యలు లేవు ప్రపంచమందునన్ ॥

343. చెట్టులపై వ్రాలుటయున్,
గుట్టలపైనాడుకొనుట, గుహల బరుంటల్
దట్టమగునడవి మొత్తము
చుట్టితిమర్చనలు సేయుచున్ గుసుమాస్త్రున్ ॥

344. మదనుండావేశించిన
హృదయమ్ముల తోడ బరవశించుచు నిదురన్
గదిసిన మాకున్ జెల్లా
చెదరైనవి కన్నకలలు చిక్కితిమి వలన్ ॥

345. వలలో జిక్కుటచేతన్
విల-విలలాడితిమిగాని, విడిపించుక యి
వ్వలకో, యవ్వలకో జన
వలను పడక యటులె నిలువ వలసెన్ వలలోన్ ॥

346. వ్యాధుడటువచ్చి, మిగుల సంబరము పడుచు
వలను విడిపించి, మాదు కాళులను గట్టి
భుజముపై బెట్టుకొని పురమ్మునకు జనియె
అమ్ముకొని మమ్ము దగిన పైకమ్ము గొనగ ॥

**ధనమూలమిదం జగత్ :**

347. పైకమ్ము లేకయుండిన
లోకమ్మే లేదు నేడు లోభులకదియే
మైకమ్మై మురిపించును
శోకమ్ముల మూలమదియె సుఖమూలమదే ॥

348. ధనము మానవ జీవనేంధనము నేడు
ధాత్రి సర్వ కార్యార్థసాధనము ధనము  ధనము సృష్టించి, దానికే
దాసుడగుచు
బ్రతుకు సాగించుకొను వెఱ్ఱివాడు నరుడు ॥

349. అన్న పానీయములు చాలినన్ని గలుగ
బ్రదుక నేర్చును ధరణిపై బ్రాణి కోటి
యెన్ని యున్నను గాని లేకున్నయట్లె
నరుడు బ్రదుకనే లేడు ధనమ్ము లేక ॥

350.కలికుందనమే కొమ్మలు
దురితమ్ములు పూలు, చెడుగు త్రోవలు ఫలముల్
నరజాతియ దారుణ విష
తరువై తనరారు చుండె ధనమూలమ్మే ॥

351.భీకర సంగరమ్ములును, బీన్గుల పెంటలు, వంచనమ్ములున్
శోకములుప్పతిల్లుటలు, చుట్టములన్ వెలివేసికొంటలున్
వాకొనరాని చైదములు, వాతెర విప్పిన బల్కు ముల్కులున్
లోకులు కాకులయ్యేదరు రూకలకై కలి కాలమందునన్ ॥

352.కడుపున బుట్టిన వారలు
కడవలికును గలసి రాని కాలమ్మగుటన్
బుడమిని వృద్ధాశ్రమములు
పొడసూపుచునుండె విత్తములు మూలముగన్ ॥

353.తన యాలియు దనయాళియు
కని పెంచిన వారు గూడ గాంచన దూరున్
గనియున్ గననట్లుందురు
వినియును విననట్టులుంద్రు విశ్వము నందున్ ॥

354.ధనముండిన గుణములతో
బనియుండదు, వాడె గొప్పవాడుగ దోచున్
ధనహీనుడు సద్గుణముల
ఖనియయ్యును వ్యర్థ జీవిగా గనుపట్టున్ ॥

355. అర్హతలు లేకయుండియునధిక ఫలము
నందుచుండును ధనము రవ్వంత విసరి
యర్హతలు గల్గి యుండియు నసలు ఫలము
నందనే బోడు నిర్ధనుండగుటచేసి ॥

356. ధనమే లోకమునందిం
ధనమై, యది ప్రజ్వలించి, తద్దయు బచన
మ్మోనరించుచుండు బ్రదుకును
ధనహీనుని బ్రదుకపక్వతన్ భజియించున్ ॥

357. ఆ ధనము కోసమే మమ్మునమ్మనెంచి,
పురము చేరెను, సిరికి గాపురములైన
మాడ వీథులయందునమ్మకము వెట్టి
బేరసారమ్ములావిర్భవించెనచట ॥

358. చిలకల జంటకునింతటి
వెలయా! యది యెక్కువనుచు వెడలెడు వారున్
జిలుకల బంధించినచో
గలుగును బాపమ్మటంచు గదలెడు వారున్ ॥

359. కలుగుచునుండిరి తుదకొక
లలనామణి వచ్చి, మమ్ములంగని, మిగులన్
బులకించి, వలసినంతటి
వెలయిచ్చి, పరిగ్రహించి, పెంచగ సాగెన్ ॥

* * *

# 5. శుకీ త్యాగము

**కాంచన పంజరము :**

360.అమ్మెడుపోవుచున్నసమయంబున భీకరమైన పారతం
త్ర్యమ్మునకున్ వడంకితిమి దారుణ దంష్ట్రలు సాచివచ్చు భూ
తమ్మనుచున్ దలంచితిమి, తాలిమిమై తలదాల్చి యుంట చై
దమ్మని యూరకుండితిమి, తప్పవుగా! తలవ్రాతలేరికిన్ ॥

361.స్వాతంత్ర్యమ్మొకడున్న పేదబ్రతుకున్ స్వారాజ్యమై తోచున
స్వాతంత్ర్యస్థితితోడ గల్గు గలుముల్ వ్యర్థమ్ములై, దుర్భరం
బై తోచున్ గద! స్వేచ్ఛ జీవునకు శ్రేయః ప్రాప్తినిచ్చున్ బరే
చ్ఛాతాత్పర్యము సౌఖ్యమీ గలుగునే! సౌభాగ్యమందించునే ॥

362.ఐనను జేయగా గలిగినట్టిది లేక, యుపాయమేమియున్
గానక, 'చావుతప్పి, యొక కంటికి లొట్టయినట్టు' లెంచుచున్
మానిని తోడనేగితిమి మంజుల కాంచన పంజరమ్ము స
మ్మానిత గేహమై యొసగె మాకొకమారుగ ఖేద-మోదముల్ ॥

363.మా యందము మా చందము
మా యాటలు, ముద్దు-ముద్దు మాటలు, పాటల్
మాయెడనా కన్నియకా
ప్యాయము కలిగించె స్నేహ భావము పెరిగెన్ ॥

364. మము లాలించుచు, ప్రేమగా నిమురుచున్, మాతోడ మాటాడుచున్
మమకారంబును బెంచుకొంచు, మము సంభావించుచున్, స్వాదు నీ
రములన్ బండ్లనొసంగుచున్, సుమధురారామమ్మునందున్న చం
దములెల్లన్ మరపింప జేసినది కన్యారత్నమాయింటిలో ॥

365. తన మృదు హస్త పల్లవము తాకినచో మనసెల్ల రేకు వి
చ్చిన విరియౌచు దేనియలు చిందుచునుండునుగాని, బంధనం
బున బడియుంటిమన్న తలపుల్ మొలకెత్తవు, కన్నతల్లి స్ప
ర్శము దలపించుచున్ దరుణి సాకుచు మైమరపించునెప్పుడున్ ॥

366. అదొక విచిత్రమైన మధురానుభవమ్ము, స్వతంత్ర వైఖరుల్
చెదరినవంచు గుందుటయె! స్నేహ లతాంత వినూత్న సౌరభా
స్పదమయి, మాదు జీవితము పండెనటంచు దలంచి, చొక్కటో
యిది-యది యంచు బల్కదరమే! యలనాటి మహానుభూతులన్ ॥

367. వలయములు దీసి మాదు చెక్కలకు దొడుగు
హారములు తీసి, మా మెడలందునుంచు
దొడవులన్నియు దీసి, మా యొడలనుంచి
తరుణి యనునిత్యమును గూడ మురిసిపోవు ॥

368. అతివ యొకనాడు హాయిగానాదమరచి,
నిదురపోయెను మమ్ముబంధింప మఱచి
యంతకంటెను మాకు భాగ్యమ్ము గలదె!
యీవలకు వచ్చి, వినువీధికెగుర వలదె! ॥

369. తనకు దానుగా వచ్చి, స్వాతంత్ర్య లక్ష్మి
దర్శనమ్మిచ్చె మాయింటి తలుపు తట్టి
యయ్యొ బల్కలేమైతిమి స్వాగతమ్ము
స్నేహ పాశమ్ము కట్టివైచినది మమ్ము ॥

**స్వాతంత్ర్యము :**

370. తెల-తెల వారగా నిదుర తేరుచు మాదరి చేరి చూడగా
దలుపు బిగింపకుండుటయు దద్దయు మా కవ పారిపోవగా
దలపకయుంటయున్ ముదిత తన్మయతన్ గొని, మమ్ముమెచ్చి, యా
వల బడవైచె బంజరము వచ్చె స్వతంత్రత మాకునింటిలో ॥

371. వీథి వాకిలియందు విహరించుచుందుము
బాటసారులు మమ్ము బలుకరింప
పెరటి గుమ్మమునుండి తిరుగాడుచుందుము
చుట్టుప్రక్కలవారు చూచి, తనియ
అతిథులేతెంచుచో యజమాని తనివోవ
బలుకుచుందుము మేము స్వాగతమ్ము
రసవతీ గృహములో రంజిల్లెదము మేము
యజమానురాలు సాయముగనెంచ
పడుకటింటిలో బ్రక్క పై బరవశించి
పండుకొందుము తరుణితో బాటుమేము
ఎట్టి యవధులు లేక యాయిల్లు తోచె
ఆకుటుంబ సభ్యులము మేమైనయట్లు ॥

372. ప్రొద్దులు సాగుచున్నవి యపూర్వ సుఖమ్ములకాలవాలమై
ముద్దులు మూటగట్టుకొని, ముచ్చటగానెదపైని నిల్పుచున్
నిద్దుర పుచ్చుచుండు దరుణీమణి, నిద్దుర లేవగానె మా
యిద్దరి మోములన్ గనుటయే శుభమంచు దలంచు నిచ్చలున్ ॥

373. తరుణీమణి సొగసుల సం
బరములకంబరమునంటు బండువ వచ్చెన్
బరిణయ కళ వచ్చినదొక
వరునకు ముడివడియెనత్తవారిల్లు చనెన్ ॥

374. పుట్టింటిని విడనాడుచు
మెట్టింటికి జేరునట్టి మెలతలు సారెన్
బట్టుక వత్తురు కనకమొ!
పట్టుం బుట్టములొ! వస్తు వాహన చయమో! ॥

375. నెలతుక తనకున్ దోడుగ
చిలుకల కవ దెచ్చుకొనియె జిత్రము గనరా
వలెననుచున్ జుట్టుం బ్ర
క్కలగల పొలతుకలు వచ్చి, కాంతురు మమ్మున్ ॥

**పిల్లలు - మురిపెమ్ములు :**

376. తెక్కల సవ్వడి వింతలు గొల్పును లే-జెవి జంటలకుత్సవమై
చక్కని పల్కులు సందడి సేయును సారెకు జిన్ని యెడందలలో
ముక్కులకుం గల రంగును గాంచిన ముచ్చటలే చిఱు కన్నులలో
నక్కడి యాపొరుగిండ్ల నిసుంగులకాటలు-పాటలు మా దరినే ॥

377. పిల్లల చిఱు నవ్వుల సిరి
మల్లియలన్ బొంగి పొరలు మకరందము మా
యుల్లమ్మున మురిపెమ్ముల
జల్లులగున్ వాకలగును సంద్రమ్ములగున్ ॥

378. పసివారి నవ్వులన్ బాల సంద్రము పొంగి,
వెలిగ్రక్కు నురుగుల కలిమి దోచు
పసివారి నవ్వులన్ బాల సంద్రపు గూన
చలివెలుంగుల తేని జిలుగుదోచు
పసివారి నవ్వులన్ బాలసంద్రపు పట్టి
సిరులనేలెడునింతి చెలువు దోచు
పసివారి నవ్వులన్ బాల సంద్రపు బిడ్డ
వెల్ల యేనుగు పంటి వెలుగు దోచు
బువ్వులన్ రువ్వు బసివారి నవ్వునుండి
వెలికి వచ్చెడి యొక వింత వెలుగురేక
గొలుసుగా మారి మా యెడందలను గట్టి,
త్రిప్పుకొనుచున్నదనునట్టి తీరు దోచు ॥

379. కల్లయు గపటమునెఱుగని
పిల్లలు మము జేరి చేయు వింతలు, సడులున్
ద్రుళ్ళింతలు, గేరింతలు
బెల్లుగ మా యెదలయందు వేడుక నింపున్ ॥

380. వచ్చియు రాని పల్కులను బల్కుచు, ముద్దులు మూటగట్టుచున్
ముచ్చటలాడుచోనెడద ముంగిటిలో సురగంగ నీరమున్
దెచ్చి, కలాపు జల్లి, దివిదేశ మహీజ లతాంత ధూళితో
నచ్చిన రంగవల్లులిడి నాక పురంధ్రులు నాట్యమాడుటల్ ॥

381. బుడి-బుడి యడుగుల తోడన్
వడి-వడిగా బరుగులెత్తి పడుచున్, నగుచుం
డెడి బసిపాపల చిఱు-చిఱు
నడతలు విలసిల్లునిల్లు నందన వనమే ॥

382. ఆ పాపల కనుజూపుల
తూపులు మదిలోని వెతలు దూరము చేయున్
దాపమ్ములు శ్రుతి మించిన
నాపిల్లల చూడ్కి వారుణాస్త్రమ్మునగున్ ॥

383. ఆకలి-దప్పిలేనియుననంటనటుల్, మముగూడియాడుచో
నాకము చేతికందినదినా రహియించుచునున్న బిడ్డలన్
గైకొనిపోవు దల్లులను గాదని త్రోయుటజేసి, యన్నమున్
జేకొని వచ్చి, ముద్దలను జేసి, యటన్ దినిపింతురెప్పుడున్ ॥

384. గోరు ముద్ద దీసి, కొసరి-కొసరి పెట్టు
చున్ననవల ద్రోయుచుంద్రుగాని
'చిలుక ముద్ద' యనుచు జెప్పి పెట్టిన బిల్ల
లారగించుచుందురాదరమున ॥

385. మొదటి ముద్ద చిలుక ముట్టిననే గాని
ముట్టమనుచు గారములను బోవు
మల్లెపూవువంటి మనసున్న పిల్లలన్
గాంచునపుడు మనసు కరగిపోవు ॥

386.ఎవరి యింటిలోనే బిడ్డ యేడ్చుచున్న
నెత్తుకొని వచ్చి మమ్ము చూపించునపుడు
మంత్రమును వేసినట్లేడ్పు మాయమగును
మోమునందున లేనవ్వు మొలకలెత్తు ॥

387.గుడిలో గల దైవమ్మును
బుడుతలలో జూడ గలుగు బున్నెము మాదై
యడుగడుగున నానందపు
జడివానల దడియుచుంట సాజమ్మాయెన్ ॥

388.విరుల తోటయందునున్న వింత-వింత యందముల్
పరవశింప జేయునట్టి పరిమళముల సౌరులున్
గురియుచుండు దేనియలును, గుబులు నింపు దెమ్మెరల్
దొరకుచుండు జిట్టి-పొట్టి దోర-దోర నవ్వులన్ ॥

**శిశూదయము :**

389.ఆ లలనకు బతిదేవుని
లాలనలో గడుపు పండి, లక్షణవతియై
బాలికకు జన్మనిచ్చెను
బాల సముద్రమ్ము సిరిని బ్రసవించునటుల్ ॥

390.పాలు పొంగబెట్టి, పాయసమ్మును వండి
యిరుగు-పొరుగు వారికిచ్చి, మురిసి
రాలు-మగలు మఱియునత్త-మామలు గూడ
పరవశించి, మేము పాడినాము ॥

391. శుక్ల పక్షమందు సొగసులీనెడి జెన్ను
జాబిలమ్మలోని సౌరులెల్ల
వచ్చి, భువికి బుల్లి పాప మోమును సొంత
యిల్లు చేసుకొని వసింప సాగె ॥

392. పట్టికి బొట్టనింద జను బాలను బట్టును బైట జాటుగా
బెట్టి, భుజమ్ము పైని నిలబెట్టుచు, ద్రేన్పగ వీపుదట్టు, జో
కొట్టును నిద్ర పట్టుటకు, గ్రొన్నన సెజ్జను బోలు బ్రక్క పై
బెట్టును, బాటలన్ మొదలు పెట్టును దల్లి యుయేలనూచుచున్ ॥

393. నిదురించిన బిడ్డను గని
కదలి చనును దల్లి వంట గావించుటకై
కదలిక యూయెలకాగిన
గదలును బసి బిడ్డ యూచగా రమ్మనుచున్ ॥

394. ఊయెల త్రాటిని గఱచుచు
హాయిగనూచెదము మేమునలవోకగ, మా
సాయమునకు దలయూచెద
రాయింటం గలుగు వారలానందముగాన్ ॥

395. ఊయెల పట్టి మంచమునకున్న యొకానొక యడ్డు కఱ్ఱపై
జేయుదుమేము నృత్యములు, చిన్ని కనుంగవ పుల్కరింపగా
హాయిగ బాట పాడుటయునాటలనాడుట, త్రాడు పట్టి,
య య్యూయెలనూచుటల్ గనుచునుంద్రు కరమ్ము ముదమ్ము
గాంచుచున్ ॥

396. చిట్టి-పొట్టి కాలుసేతులు గదుపుచు
బిడ్డయాడుచున్న వేడ్క మాకు
నటులె మేము గూడనాటలాడెదమేని
మురియుచుండు శిశువు పరవశించి ॥

**బుగ్గచుక్క :**

397. బొట్టు-కాటుకయును దృష్టి బొట్టు పెట్టి
పట్టు పరుపుపై దన పట్టి పండబెట్టి
వెలది తనయింటి పని చక్క బెట్టుకొనును
మమ్ము కావలి పెట్టి, భయమ్ము నెట్టి ॥

398. తెల్లని పిల్ల తమ్మి నునుదేనియలన్ గడుపార ద్రావి, మ
త్తిల్లి పరున్న దుమ్మెద యిదే యని కొందరు; కాదు-కాదు జా
బిల్లిని గల్గు మచ్చ గనవే! యని కొందరు బల్కుచుందురా
నల్లని బుగ్గ చుక్క గనినన్ జిఱువెన్నెల నవ్వులీనుటన్ ॥

399. తెల్లని పాల సంద్రమున దీరుగ నిద్దుర పోవుచున్న యు
త్ఫుల్ల దళాయతాక్షునిగ దోచుచు, జెక్కిలిపైని జుక్క శో
భిల్లుచు, జూచువారి కనువిందొనరింపగ దృష్టి చుక్కనా
జెల్లునె! యంచునుప్పుగొని, చేడియ దృష్టిని దీయు మాటికిన్ ॥

400. పాల కడలియందు గాలు నోటికి జేర్చి,
మఱ్ఱియాకుపైని గుఱ్ఱు పెట్టు
బుల్లి వేల్పునాగ బుగ్గపై గల చుక్క
సొగసులీనుచుండు జూపరులకు ॥

401. అమృతమాను వేళనసురుండు రాహువు
జాడ చెప్పినట్టి చంద్రుపైని
గినుకనూని పట్టుకొను నాటి పాక్షిక
గ్రహణ మనగ జుక్క గానవచ్చు ॥

402. వెండి కొండపైని బిల్ల యేనుగు నిద్ర
పోవునట్లు; గాఢు మొయిలు తోడ
జలువ కొండ చేయు జెలిమి వోలెను జిట్టి
బుగ్గ తోచుచుండు నిగ్గు దేరి ॥

403. మోము చంద మామ బుడి-బుడి నగవులే
వెన్నెలలును, గలువ విరులు కనులు
వింత-వింత సొగసు సంతరించెడి మచ్చ
పోల్కి వెలుగు చిన్ని బుగ్గ చుక్క ॥

**అనుబంధము :**

404. ఆ పాపను లాలించుట
కై పని బూనుటలు మాకుననుదిన కృత్యం
బై పరవశించుచుంటిమి
పాపాయికి మాకు బూర్వ బంధమ్మేమో! ॥

405. మమ్ము చూడకున్న మామాట వినకున్న
ముట్టుకొనదు పాలు చిట్టి తల్లి
పాప లేత నగవు వానలో దడువక
మనసు కుదుట బడదు మాకు గూడ ॥

406. నేను సరే! నిసుంగునకు నేర్చిన సేవలుచేయుచుందు గా
నీ, నను గట్టుకొన్నది వినిర్మల వత్సలతా విశేష వి
జ్ఞాన మరంద పానమును సారెకు జేసినయట్లు పాపయే
తానుగ, దానె పాపయన దన్నికటంబును వీడదెన్నడున్ ॥

407. తా దినుటకు బరువెత్తదు
నే దింటినా-లేదా! చూడ నేరదు శిశు స
మ్మోదమ్మే తన హృదయా
హ్లాదమ్మై యాడి-పాడునచటనె యుండున్ ॥

408. చిన్నారి మోములో జిఱునవ్వు తోచెనా!
పెంటి చిల్కకు గుల్కు విస్తరించు
పలుకరించినయట్లు పాపాయి చూచెనా!
పులకింతలొక కోటి పొటమరించు
చిట్టి చేతులు చాచి చిల్క మైదాకెనా!
కరగి నీరైనట్లు పరవశించు
ఱెక్కలాడగ గంటి ఱెప్పలాడించెనా!
పండువల్ శతకోటి పరిమళించు
పాపతోడిదే లోకమై పరిఢవిల్లు
చిట్టి లేకున్నచో గుండె చీకటిల్లు
బిడ్డ యచ్చట్లు-ముచ్చట్లు విరుల జల్లు
పిక్కటిల్లెనా! తన గుండె పెల్లగిల్లు ॥

409. తల్లియు దండ్రియు దమ-తమ
పిల్లలపై బ్రేమగొనుట విదితమె యయ్యున్
దల్లికి బ్రాణములైదును
బిల్లలయందే వసించు విడివడని ముడిన్ ॥

410. తన బిడ్డ గాక పోయిన
తనకుంగల యాడుతనమె తల్లిని మరపిం
చినదై, రక్షణ కవచ
మ్మనునట్లుగ సాకుచుండుననవరతమ్ముగ్ ॥

**కాళ రాత్రి :**

411. సాగుచునుండె గాలము ప్రశాంతముగా సుఖమెల్ల మాదియై
తూగుచు, జిట్టి పాప కనుదోయి ప్రపంచముగా జరించుచున్
రాగల కాలమిట్టిదనరాదుగదా! గుడిలోని గంటకున్
మ్రోగుట, మూగబోవుటయు, మ్రోగుట, యాగుట సాజమే గదా! ॥

412. అదియొక కాళరాత్రి, జగమందు భయంకరమైన చీకటుల్
గదిసినవాకసమ్ము భయ కంపితమైనటులార్చుచుండెనం
బుదములు నీరుగారినవి, బోరుననేడ్చుచు బర్వులెత్తగా
మొదలిడె గాలియున్, బ్రకృతి మొత్తము చంచలమయ్యె భీతిమై ॥

413. కదలకయుండు లోకమతి కంపితమై శివమెత్తుచుండగా
గదలెడు బ్రాణికోటి భయ కంపితమై యెటనున్నదచ్చటే
కదలక నిల్చిపోయినది; గాలియు, వానయు గూడి, ప్రాణులన్
బ్రిదులగ జేయు, వేరుపడి వీచిన, వచ్చిననెంత మేలగున్ ॥

414. పిడుగులునుఱుములు కలుగన్
దడ-దడలాడినది సర్వ ధాత్రియు, నడుమన్-
నడుమన్ మెఱుగుం దీవల
గడ-బిడచేనాంధ్యమునకు గాఢత పెరిగెన్ ॥

415.గాలి వానకు లోకమంతయు గంగ-వెల్లులనెత్తుచున్
సోలిపోవుచు, క్రుక్కి పోవుచు, జూచుచున్నది దిక్కులన్
నేల-నింగియునొక్క టైనవి నీరసూత్రము సాక్షిగా
రాలుచున్నవి యాకులెన్నియొ ప్రాణిభూజ చయమ్మునన్ ॥

416.తలయెత్తి బ్రదుక వలసిన
ఫలవృక్షములెల్ల నేలబడి పొర్లాడెన్
దలవంచి, సాగు వాకలు
ప్రళయమ్మొనరింప భూమి పై-పైకెగసెన్ ॥

417. తరువుల్ కొమ్మలు వెట్టి కేకలిడుచున్ ధాత్రీస్థలిన్ గూలగాన్
బరువుల్ పెట్టెను బ్రాణిలోకము భయభ్రాంతమ్ముగా జట్టునన్
ధరణీ మండలమెల్ల దద్దరిలె జింతావ్యగ్రమై లోక భీ
కర కాలాహి ఫణా విశృంఖల మహోగ్ర స్ఫూర్తి కన్పట్టగన్ ॥

418.చెట్టుల గుట్టల మాటున
బుట్టలను బిపీలికములు ముచ్చట పడుచున్
గట్టుకొనంగా; బయటకు
నెట్టిన యా పన్నగముల నీడలు విచ్చెన్ ॥

419.పుట్టలు విచ్చుటన్ భుజగముల్ పలుత్రేవలు పట్టుకొంచు నే
తట్టునవేనినే కలుగు దారి కనంబడినన్ రయమ్మునన్
గుట్టుగ దూరి దాగుటకు గోరలు సాచి, విషమ్ము గ్రక్కుచున్
జట్టున బర్వులెత్తినవి చాటుల-మాటుల బాటలంటుచున్ ॥

420. కలుగులు దొరికిన పాములు
తల చిన్నది చేసికొంచు దలదాచుకొనెన్
తలవ్రాత మారినప్పుడు
తల పొగరులు తగ్గిపోక తప్పదు ధరణిన్ ॥

421. కలుగులు దొరకని పాములు
కలగుండుం బడుచు నాల్గు కడలుం జనియెన్
తల దాచుకొనుటకొఱకో!
తల విసమును గ్రక్కి, భూత తతి జంపుటకో! ॥

422. చెల్లా చెదరై యదనపు
గల్లోలము దెచ్చె భూత గణమునకు ఫణుల్
'విల్లుగొని క్రింద బోయయు
నల్లదె! యా నింగి గృధ్ర'మన్నటులాయెన్ ॥

**కాలాహి :**

423. తన తలదాచుకొంటకొక దారిని-దెన్నును గానలేక వ
చ్చినదొక నల్ల త్రాచు విషజీవి సరాసరి చిట్టిపాపకై
యనువుగ బ్రక్కవేసిన యుయాలకు గట్టిన త్రాటిమీదుగా
బనివడి యడ్డుకఱ్ఱపయి బ్రాకి, దెసల్ పరికింపసాగెడిన్ ॥

424. నింగికి-నేలకున్ నడుమ నిల్చిన తూగుటుయేల యందునన్
బంగరు రంగులీను బసిపాప శయించుచు స్వప్న సీమకున్
రంగులు వేయుచున్నది, తలంపక యంచున బొంచి, కాటు వే
యంగల దారుణోజ్జ్వల విషాస్య భుజంగము తొంగి చూచుటల్ ॥

425. పాపము నేమిచేసినది పాప! పవిత్ర మనోజ్ఞ హాసముల్
చూపుచు, స్వప్న లోకములు చూచెడి వేళ భుజంగరాజమే
పాపము మూట గట్టుకొన వచ్చినదోగద! చిచ్చువెట్టి, సం
తాపము పెంచ వచ్చినదనారత శాంతి గృహంగణమ్మునన్ ॥

426. ఊయెల త్రాటినల్లుకొని యున్నది యా యెలత్రాచు ప్రాణముల్
తీయనివౌటచే భయము తీరకయో! పరజీవి ప్రాణముల్
తీయుటకో! పరాసువులు తీయుట తేలికగాని, ప్రాణముల్
పోయుటచేతగాని బలముల్, గుణముల్ కొఱమాలు సంపదల్ ॥

427. తన ప్రాణమ్ములనడ్డు వెట్టి, పర సంత్రాణమ్ము గావింప నే
ర్చిన వారే మహితాత్ములీజగతిలో క్షేమంకరుల్, కీర్తి వ
ర్ధనులై వెల్గుదురూరకే యితరులన్ దండించుటో, ప్రాణముల్
గొనుటో, తామపకీర్తి రాజ్యమును గైకొంటల్ గదా! వ్యర్థులై ॥

428. పామును జూచి, త్రాడనుచు భ్రాంతిని బొందిన యింటిలోని వా
రేమియు భీతిలేక నిదురింప దొడంగిరి, భ్రాంతియట్టిదే!
లేమియు గల్మిగా- గలిమి లేమిగ గన్పడు సత్యదర్శన
స్వామిత కల్గనీదు సువిచార పరాఙ్ముఖులెల్ల జీవులున్ ॥

429. మఱియొక చోటనున్న ననుమానము కల్గునొ! కల్గకుండునో!
యెఱుగము గాని, పాపయెడనే తన ప్రాణమ్ములెల్లనిల్పి, యే
మఱక వసించు బెంటికనుమానము సోకి, యుయేల వంకకే
పొఱిపొఱి చూడ సాగినది మూయని ఱెప్పల వేయికన్నులన్ ॥

430. గాలికి గదలాడెడిను
యేలకు గల మూడు మూలలెప్పటి వలెనే
క్రాలుచునుండగ నాల్గవ
మూలన్ రవ్వంత భేదమును గమనించెన్ ॥

431. అనుమానంబు శుకీ మనః కుహరమందారంభమై, డోల యూ
గినచో, వంకర-టింకరల్ పొడముటల్ క్షేమంబు గాకుండు, ని
ద్రను భంగమ్మును జేయు, ద్రాటి బలమల్పంబైన, విచ్ఛిన్నమై
నను, గ్రిందంబడునేమొ పాపయను జింతన్ జెంతకుం జేరుచున్ ॥

432. త్రాళుల మొదళ్ళు చూచెను
ద్రాళుల చివరలునునటులె త్రాళుల ముడులున్
గ్రాలుచునున్నవి దృఢముగ
నేలోపము లేక భేదమేదియొ తోచున్ ॥

433. మూటికంటెనొకటి మొఱటుగా గనుపట్టె
త్రాడు కొంత తడిసి రంగు మారె
మట్టి చాఱికలును గొట్ట వచ్చినయట్లు
గానవచ్చుచుండె గదిపె సుంత ॥

434. ఆెక్కల తోడ దట్టుచు, బరీక్షను జేయుచు, మధ్య-మధ్యలో
ముక్కున సూటిగా బొడిచి, మోటుగ గాళులతోడ గీరుచున్,
జెక్కుచు జూచునా మసక చీకటిలో గనవచ్చినట్టులా
అక్కలు పాము తోక చివరన్ దగులన్ బుసకొట్టె గ్రక్కునన్ ॥

435. గుండియ జారిపోయినది, క్రూర విషోత్త ఫణా భయంకరో
ద్దండ భుజంగమయ్యెడల ద్రాటిని జుట్టుకయుంట గాంచెనా
గండము దాటుటెట్లొ! ఫణి కాటునకున్ బసి బిడ్డ యేమి గా
నుండెనొ! యెల్లప్రాణములునున్నవి చిల్కకు బాపయందునే! ॥

436. ఎలుగెత్తి యఱచెనేనియు
గల జనమును లేచు రభస కలుగును, భయ వి
హ్వాలమగుచో బన్నగమూ
యెలలోనే పడిన, బిడ్డ యేమయి పోవున్! ॥

437. గడబిడలు పుట్టకుండగ
నొడుపున దప్పింపగోరి యురగమ్మును, నా
యెడ జేరి నిదుర లేపెను
వడిగా రమ్మనుచు ముక్కు బట్టుచు లాగెన్ ॥

438. వేటగానికి జిక్కిన వేళ గూడ
జెలియ కనుదోయిలో నీరు చిందలేదు
జంకుగొనలేదు, నేడు వడంకుచుండె
నేలననుకొంచు లేచి, వీక్షించినాడ! ॥

439. బ్రతుకుటుయ్యేల సెజ్జపై పవ్వళించు
బడుగు జీవిని ద్రాడు సర్పముగ మారి
కాటు వేసెడి గడియకై కాచినట్లు
కాచుకొనియున్న యొక నల్ల త్రాచు గంటి ॥

440. ఆ చీకటిలో నల్లని
త్రాచును గని, దానినెటుల దప్పించుటయో
తోచక తిక-మక పడి, యా
లోచనమును జెలియ వీను లోగిలినిడితిన్ ॥

## శుక భుజంగ సమరము :

441. ఇరువురము గూడి, త్రాచు దగ్గఱకు జేరి
గుట్టుగానొక్కమారుగా గొంతు పట్టి
క్రింద బడగొట్టితిమి కోరకందకుండ
నొడుపుగా ముక్కు పట్టును విడువకుండ ॥

442. గడ-బిడ బడి, సుడిబడుచున్
వడి-వడిగా జుట్టుకొనుచు, బడగ విడుచుచున్
ముడుచుచు దిరుగం బడుచున్
మెడ విడిపించుకొన, వేయి మెలికలు తిరిగెన్ ॥

443. వాల కశా ఘాతమ్ముల
జాలముతో జావమోదు జతనము చేసెన్
మాలావు చిన్నదయ్యును
గాలమునకు జిక్కు జేపగా బొర్లాడెన్ ॥

444. ముక్కుంబట్టు మరింతగా బిగియుటన్ బోరాటమున్ జేయుచున్
స్రుక్కంజొచ్చును, మేన నెత్తురును గాఱున్ వాకయై, యయ్యు మా
ఱెక్కల్ తోకను బట్టి చుట్టుకొనుచున్, రెట్టించి కొట్టున్, వడిన్
నొక్కున్ జిక్కులు వెట్టు, నెట్టుకొను, జిందుల్ త్రొక్కునొక్కుమ్మడిన్ ॥

445. తెక్కలు విఱుగం జొచ్చెను
ముక్కులలో నొప్పికూడ మొదలగుచుండెన్
స్రుక్కినను మాదు మేనులు,
గ్రక్కదలగనీము భుజగ కంఠము బలిమిన్ ॥

**శుకీ పన్నగ మృతి :**

446. మేన గల్గిన నెత్తురంతయు మేదినిన్ బ్రవహింపగా
వానపాముగ మారిపోయెను బన్నగమ్ము క్రమమ్ముగన్
ప్రాణ శక్తికి దూరమైనది వ్రాల్చె భోగము వాలమున్
దాని నూకలు చెల్లిపోయెను ధాత్రికిచ్చెను గాత్రమున్ ॥

447. గాలి మేతరి యుసురులు గాలియందు
గలసి పోవుట గమనింప గలిగినాము
'బ్రతుకు జీవుడా'! యని ముక్కు పట్టు విడచి,
తలగి, నిద్రించితిమి మేము తెలివి తప్పి ॥

448. తెల్లవారు సరికి దెలివి తప్పిన నేను
మేలుకొంటినెటులొ! మేను దీవ
వడలి పోయె బలము సడలి పోవుట జేసి,
చెలిని మేలుకొలుప జేరుకొంటి ॥

449. ముక్కుతోడ ముట్టి, ఱెక్కలతో దట్టి,
నిదుర లేపుచుంటి గదలదాయె
పన్నగమును జంపి, పాపను బ్రతికించి,
నన్ను విడచి తాను నాకమేగె ॥

450. కూలిపోయినట్లయ్యె దిక్కుల మొదళ్ళు
బ్రద్దలయినట్టులయ్యె నా బండగుండె
ధరణి తిరుగుడులాగి, నా తలకు దగిలె
జూచుచున్నంత సర్వమ్ము శూన్యమాయె ॥



***

# 6. వైరాగ్యము

**శుక వేదన :**

**451.** చెలియకు దూరమై కటిక చీకటిలోబడి కొట్టుకొంచు బ్రొ
ద్దుల గడుపంగనెట్లు? దయతో గనుదోయిని విప్పి, చూడవే!
పలుకవె! నాదు గుండె గుడి వాకిటి తల్పులు తీసియుంచితిన్
నిలువవె! నన్ను వీడనని నీవు వచించితివెన్ని మారులో! ॥

**452.** ఒంటరి వాడనై బ్రదుకుచున్నపుడెందులకీవు వచ్చి, నా
వెంట జరించినావు? జత వీడక, వాడని క్రొత్త నెయ్యపుం
బంట లొసంగినావు, మృదు మాధురులం గయిసేసినావు, నా
జంటగ మారి, క్రొవ్వలపు సౌరులు నింపి, పరిత్యజించెదే! ॥

**453.** గుడి విడ నాడి, క్రొవ్విరుల గూటికి దోటకు బోదమన్న నీ
యడుగులనంటి వచ్చితిని యచ్చటినుండి గిరుల్, తరుల్ ఝరుల్
గడచెదమన్న వచ్చితిని, గానన సీమకు గూడ వచ్చితిన్
నడచితిమన్నిటం గలసి, నాకము మాత్రము రాక పోదునే! ॥

**454.** చెప్పక నాకునేపనియు జేయవు నీవిపుడెందు బోయితే
యొప్పుల కుప్ప! నీకు సుఖముండునె నాజత లేని నాడు? నే
నిప్పుడమిన్ క్షణమ్ము నివసింపగ జాలను నమ్ముమిప్పుడే
నిప్పులలోన దూకెదను నీ దరికిన్ బరువెత్తి వచ్చెదన్ ॥

455. నను విడనాడుచునెచటకు
జనవుగదా! యిప్పుడెటుల జనెదవు? భయమున్
గొనవో! నన్నున్ వీడగ
మనసెట్టుల గలిగె జాలి మాలితివేలా! ॥

456. నా గుండియలో నీవే
నీ గుండియయందు సతము నేనే నిలువం
గా గుండె నీది యాగిన
ఆ గుండెను మృతిని బొందినట్టిది నేనే ॥

457. నాయెద యగ్ని గోళమయి నన్ను దహించుచునుండ, నీవున
న్యాయముచేసి, నన్ను విడనాడి, త్రివిష్టప లోకమందునన్
హాయిగనుండ గోరితివి, యాత్మ సఖున్ విడనాడి యచ్చటన్
శ్రేయమునందగా జెలియ! చిత్తము నీకెటులొప్పె జెప్పవే! ॥

458. నా దరికేల జేరితివి నాయెదలో వలపుల్ సృజించి, యా
హ్లాదమొసంగుచున్ బ్రణయ హాస మనోజ్ఞ శరన్నిశీథినీ
స్వాదిమ చంద్రికా ఝురుల స్నానములాడిన తీపి గుఱ్తులన్
గాదని వీడి పోయితివి కాల్చు ననున్ జెలియా! గతస్మృతుల్ ॥

459. కాలము కత్తి గట్టుటయ గాక, పవిత్ర మనోజ్ఞ నురాగ వి
ద్యాలహరీ జలేజములయందు జనించిన తేనె వాకలన్
గ్రోలుచునున్న జంటపయి గొడ్డలి పెట్టగనేల? నేడు శ్రే
యో లతికా లవిత్రమునకూపిరులూదిన కాలుడెవ్వడో! ॥

460. గుండె గుడియందు నీవుగా గొలువు సేసి,
వలపు విరి తేనె యభిషేకములను గొనుచు
మురిసి, విరిసిన నీమోము మొలక నవ్వు
మఱపునకు రాదు నీకునేమఱుట తగునె ॥

461. అనుచున్ దిక్కులు విచ్చుచున్నటుల నేనాక్రోశమున్ జేయగా,
జనముల్ లేచి, పరిస్థితిన్ గనిరి యాశ్చర్యమ్ము పాలైరి, త
త్తనయన్ గావగ జిల్క ప్రాణములనే త్యాగమ్ము గావించుటన్
గనలెన్ గుండెలు క్రుంగి యేడ్చిరచటన్ గన్నీరు మున్నీరుగాన్ ॥

462. ఇదియే జన్మ ఋణాను బంధమొ గదా! యెందైన బుట్టింటి సం
పదగా జిల్కను దెచ్చుటల్ గలుగునే! ప్రాణమ్ములర్పించి, య
య్యదియున్ సంతతి గాచుటల్ గలిగెనే! యా బిడ్డలో జిల్క యు
న్నది దుఃఖింపకుమన్న సాంత్వనములందన్ వచ్చెనప్పట్టునన్ ॥

463. ఎంత విచిత్రమో! చిలుక యెక్కడ! దారుణ కాలకూట వి
క్రాంత భుజంగమెక్కడ! దురమ్మున దానిని సంహరించి, ని
శ్చింతగ బ్రాణముల్ విడచి, జీవితమిచ్చెను జంటిబిడ్డకా
వింతను జూడ రండనుచు వేల జనమ్ములు చేరిరచ్చటన్ ॥

464. ఔర్ధ్వ దైహిక క్రియలు శాస్త్రాన్వితముగ
చేసి, యద్దాని రూపమ్ము చిత్తరువున
నిలిపి, గోడకు దగిలించి, నిత్య పూజ
సలుపుచుండిరెల్లరు కృతజ్ఞతలతోడ ॥

465. చిలుక త్యాగమ్ము నే గుర్తు చేసికొనుచు
బడతి తన బిడ్డకై 'కీరవాణి' యనుచు
బేరు పెట్టినదెల్లరున్ బిలుతురటులె
త్యాగమొనరించి,చెలి శాశ్వతముగ మిగిలె ॥

466. నా చెలియే నను వీడిన
యీ చోటుననుండ జాలనెచ్చటికేనిన్
దోచిన చోటునకేగెద
నోచానా! సెలవొసంగవో! యని వేడన్ ॥

467. కన్నుల నీరు పెట్టుకొని, గట్టిగ గుండెలకత్తుకొంచు, నీ
కెన్నడునిట్టి మాట వచియింపగరాదు నినున్ ద్యజించి, నే
నన్నము నీరు ముట్టగలనా! కనుదోయికి నిద్ర వచ్చునా!
నన్నటులుంచి 'పాప' విడనాడగ నీ మనసెట్టులొప్పెడిన్ ॥

468. ఇప్పటికే పాపాయికి
జెప్పంగా లేని బెంగ చిత్తమునందున్
జొప్పడుచున్నది కంటికి
నెప్పుడు గనిపించు జిలుక యిప్పుడు లేమిన్ ॥

469. ఇప్పుడు నీవుగూడ గనుపింపక పోయిన బిడ్డ దక్కునా
చెప్పు! ద్వదీయ చిత్త సరసీరుహ భాస్కర రోచియైన నీ
యొప్పుల కుప్పయే యొదిగి యుండిన పాపను వీడి, పోవగా
నొప్పునె నీకు! చంచలతనొందకుమా! దిగ్రమింగుమా! వ్యథన్ ॥

470.అనుచున్ బ్రతిమాలిన గా
దనలేకయునుండలేక తట-పట బడి, వ
త్తును గొంతకాలమెటకే
జని, నమ్ముము చోటు మార్పు శాంతినొసంగున్ ॥

471.తప్పక వత్తు బాసలను దప్పెడి దత్త్వము లేదు నాకు నీ
చెప్పినదెల్ల నా జెవికి జేరి యొకింత ప్రశాంతి దక్కె నే
నిప్పటికెందు బోయిననునిచ్చటనే మదియుండు నమ్ముమా!
తప్పక వత్తునిప్పటికి దప్పదు వీడుమటంచు వేడినన్ ॥

472.బలవంతముపైనెటులో
దలయూచెను దన్వి, నింగి దారినబడి, అె
క్కలలో బలమున్నంతకు
వలసిన తావులకు వెడలి, వ్రాలుచునుంటిన్ ॥

**ఉపదేశము :**

473.గిరియిదే! కుసుమాస్త్రు కేళీ విలాస మం
దిరమౌచు మాకు గాపురమొసంగె
ఝరి యిదే! ప్రణయ సంతప్త కాయములపై
చిఱు గాలులను వీచి సేవ చేసె
సరసిదే! చిలిపిగా జలకమ్ములాడగా
నవకాశమిచ్చి, మమ్మాదరించె
తరువిదే! యొకరికొక్కరు నోటికందింప
పక్వమ్ము లైనట్టి ఫలములొసగె
ఇదియె పొదరిల్లు ముద్దుగానొదిగి పోయి
క్రీడ లాడంగ జల్లని నీడనిచ్చె
నాడు-నేడును బ్రకృతి యందమ్ము మార్పు
చెందనే లేదు-నేడు నెచ్చెలియె లేదు ॥

474. చెంతను జెలియుండిన జగ
మంతయు నాకందముగనె యగుపడ జొచ్చెన్
జెంతను జెలి లేమిని నా
వింతలు మది కెక్కవాయె వెగటు జనించెన్ ॥

475. తిన దగిన ఫలములెన్నియొ
కనులకు గనబడియు రక్తి కలుగక పోయెన్
దినసైతి ద్రాగనైతిని
మనమున నా సఖియ గుఱుతు మాయక యుంటన్ ॥

476. ఎఱుక గల తావులన్నియు
బఱతెంచితి నోపినంత వట్టుననడవిన్
తఱిగిన ఱెక్కల బలమున
నొఱగి-యొఱగి స్పృహను దప్పి యుర్విం బడితిన్ ॥

477. అపుడొక యోగిపుంగవ దయా పరిపూత కరమ్ము దుర్భవా
తప పరితాప వారణ సుధాకర బింబమునా స్పృశించె, దే
హపు రుజలెల్ల బోనడచెనాకలి-దప్పులు తీర్చె, జేయుచున్
గపురపు దున్కలై యెసగు గమ్మని పల్కుల తోడి వైద్యమున్ ॥

478. చిత్త వికార భీకర నిశీథినిలో గొఱవడ్డ వెల్గులన్
మొత్తము దెచ్చి, దోసిటను బోసినయట్లు, బవిత్ర వాఙ్మహో
దాత్తములైన భావముల దారుల సాంత్వన రూపమైన పూ
గుత్తులనుంచి, నా నడతకున్ బలమున్ గలిగించె యోగియున్ ॥

479. అతని కన్నులందు గలయట్టి యొకానొక కాంతి రేఖ నా
చేతములోని పెన్ గుబురు చీకటి గూటికి జెంపపెట్టు, సం
ప్రీతినెఱుంగనట్టి యవివేక విహార పిశాచికిన్ గశా
ఘాతము, సార్వకాలిక వికాసమొసంగెడి శాంతి పేటియున్ ॥

480. పలికెడి పల్కులెల్ల భవ బంధములన్ దెగగొట్టునాయుధ
మ్ములు సుడిగుండమందు బడిపోయి, మునుంగుచు, బైకి వచ్చు దా
రులు గనలేక యీదుచును రొప్పెడి వారిని గట్టు జేర్చు నా
వలు; రస భాసురమ్ములు శుభంకరముల్, మహతీ నినాదముల్ ॥

481. వాతెర విప్పెనా! విరుల పండుగ గుండియనంటినట్లుగా
జేతము పల్లవించు; రస సింధువు పొంగి, సుఖానుభూతి వీ
చీ తతి నింగినంటు, మతి చెడ్డ దురూహల పోహళింపులన్
జాతఱ పెట్టుచున్, విషయ వాసనలన్ విదలించు నేర్పునన్ ॥

482. అట్టి యోగీశ్వరుండు నన్నాదుకొనియె
ముద్దు మాటలతో వింత బోధ సేసె
హృదయ పరితాపమెల్ల నశింప జేసె
అసలు-సిసలైన యానంద మందజేసె ॥

483. ముచ్చట ముక్కుబట్టుకొని, ముద్దులు సేయుచు వీపు దట్టుచున్
నచ్చిన యోగిరమ్మిడుచు, నాకనులం గనుదోయి జేర్చి నా
వచ్చిన కష్టమున్ దెలిసి, పైకొను దుఃఖమునెల్ల మాన్పగా
వచ్చిన రీతిలో మధుర భాషల జేసె హితోపదేశమున్ ॥

484. నీ సఖి నిన్ను వీడెనని, నీవు నిరోదన దారుణ వ్రతా
వేశమునందియుంట తగవే! పసిబిడ్డకు బ్రాణ దానమున్
జేసిన త్యాగ జీవినికి జేతులనెత్తి, నమస్కరించి, సం
వాసము జ్ఞప్తి దొంతరల పందిరిలో నొనరింపగా వలెన్ ॥

485. త్యాగము చేయుటన్ బ్రదుకు ధన్యతగాంచె శుకీమతల్లికిన్
భోగము వీడి, త్యాగమును బూజ్యతమమ్మని యెంచు వారలే
యోగులు, బెంగ పెట్టుకొని యూరక యాత్మహతిన్ బొనర్చుచో
యోగము కాదు పాపము శుకోత్తమ! నా పలుకాలకింపుమా! ॥

486. ఉత్తమ లోకమందుకొనియున్నది నీ చెలి త్యాగ ధన్యయై
పుత్తడివంటి జీవితము పూనికమై తెగటార్చుకొన్న నీ
కత్తరివాసమౌనె! సఖి యక్కడ నీకు లభించునే! భవో
పాత్తమునైహలౌకికము బంధమనంతరమందునుండునే ! ॥

487. ఎక్కడి వారో కూడుదు
రొక్కటిగా, ఋణము తీరుచుండిన, వేరై
యెక్కడికో పయనింతురు
దక్కినదే ప్రాప్తమనుచు దలపగ వలయున్ ॥

488. పుట్టిన వారొకనాటికి
గిట్టుదురటు పుట్టుచుంద్రు గిట్టిన వారల్
పుట్టుట-గిట్టుటలందగు
పట్టునుబో ముందు-వెనుక, వంతలు వలెనా! ॥

489. చెలి నీకు దీపి గుఱుతుల
కలిమి ప్రసాదించి, పోయె గలకాలమ్మా
బలిమిని మనుమా! చక్కని
పలుకులతో హితము తెలియ బఱచుచు జనుమా! ॥

490. అనుచున్ హితములు పల్కుచు
బనివడి నను బంపినాడు పాపను జేరన్
మనసే వైరాగ్యాంబుజ
వనమైనది జ్ఞాన హంస పదములు సోకన్ ॥

491. అచ్చటినుండి లేచితి, విహాయస వీథిని సాగిపోవుచున్
వచ్చితినీ రసాలమున వ్రాలితినీ తరురాజ బాధకున్
నొచ్చితి, నీ తపమ్ము గన నోచితి, సంగతి చెప్పి, వెన్కకుం
దెచ్చితి, నీకు గల్గు బరిదేవనమున్ విని, మంచి చెప్పితిన్ ॥

492. జగమే భగవద్రూపము
భగవంతుండొసగినట్టి వైభవములతో
జగతిని సేవించుటయే
భగవద్వరివస్యకంటె వంద్యము సుమ్మీ! ॥

493. ఉన్నది జగతీ సేవకె
యున్నది యనుకొంచు, లేనిదుండన్ బనిలే
కున్నది యని భావించుట
కన్నను సుఖమేమి గలదు జ్ఞానంబిదియే! ॥

**పునర్వసంతము :**

494 నాకున్ దోచిన పల్కు బల్కితిని యానందంబుగానింత వ
ట్టాకర్ణించిరి, చాల సంతసము, నాకై చూచుచుండున్ దనూ
ప్రాకారమ్ము సమస్తమక్షిమయమై పాపాయి, తత్సన్నిధిన్
సాకల్యంబుగ శేష జీవితము చింతాదూరమున్ జేసెదన్ ॥

495. సెలవొసంగిన బోయి వచ్చెదనటంచు
బలుకుచుండగా గ్రొత్త శోభలు స్ఫురించె
చెట్టు తనమేన గొంగ్రొత్త చివురు తొడిగె
కోకిలమ్మకు దీయని గొంతు వచ్చె ॥

496. ఆకురాలు నాటి వ్యథ పోయి కొంగ్రొత్త
చిగురు తొడిగి, సంతసించె దరువు
కష్టములు గతించి యిష్టముల్ సమకూరు
గలత పడకుమనుచు బలికినట్లు ॥

497. మనసునకుం బరివర్తన
జనియించిన కోకిలమ్మ సంగీతములో
వినవచ్చె గ్రొత్త సంగతి
ప్రణయము పైమెట్టు కాగ బ్రణవము తోచెన్ ॥

498. వచ్చె వసంత కాలము భువమ్ము దివమ్ముగ మారె, బద్మముల్
విచ్చెను, గండు తుమ్మెదల పిండులు తేనియలాని పాడగా
వచ్చినవా సరస్సులలసానిలముల్ గయిసేసె, గుండెలో
బ్రుచ్చిలియున్న మన్మథుని ముచ్చటలన్నియు రట్టుసేయుచున్ ॥

499. భవ జనితమ్ములౌ విషయ వాసనలన్నియు రాలిపోయి, గౌ
రవ కర యోగ జీవన విలాసము నేర్చిన యోగి వోలె బ్రా
తనియగునాకులన్ విడచి, తద్దయు గ్రొత్త చిగుళ్ళు భూమిజ
ప్రవర రసాలమూనినది వచ్చిన యామనికాతిథేయమై ॥

500. చిక్కగ జ్ఞానము కర్మము
నుక్కు మిగిలి యూర్ధ్వ గతికి యోగి చనునటుల్
ఱెక్కలు రెప-రెప లాడగ
జక్కగ జదలంటి చిలుక సాగగ జొచ్చెన్ ॥

501. పలికి యామనికై పునస్స్వాగతమ్ము
నుత్సవము సేయ మన్మథుండూచుచుండె
సోయగమ్మగు బచ్చ జెండా యనంగ
జిలుక యెగురుచు నింగి యంచులను దాకె ॥

502. తెలి మబ్బులలో బచ్చని
చిలుకయునా యెఱ్ఱముక్కు జెలగు ద్రివర్ణం
బులతో, భారత దేశో
జ్జ్వల కీర్తి పతాక నింగిపైనెగురు నటుల్ ॥

503. ఱెక్కల గాలి సవ్వడి విరించి ముఖావళి యొక్క మారుగా
ఋుక్కులు పల్కుటల్, గుణ వరిష్ఠులకున్ జయవెట్టు చుండుటల్
రక్కసి మూక గుండె పగులన్ గొరడా ఝళిపించుచుంటగా
చక్కగ వీనులన్ దగుల సాగెను నింగికి జిల్క సాగగన్ ॥

504. చిగురులు తొడిగిన తరువుల
సొగసులు, పరువము కలిగిన సుదతుల వగలున్
జిగియును, బిగియును మదనుని
జగతికి వరముగనిడినవి చవులు మిగులగన్ ॥

505. విచ్చిన కన్నుదమ్మి రస వృష్టికి బుష్టినొసంగుచుండగా
ముచ్చటగా బికమ్ము రసమోహన గీతములాలపింపగా
బచ్చని చీర చుట్టుకొని, వాల్జడ మల్లియలుల్లసిల్లగా
వచ్చె వసంత మాధవి ప్రభాత సమీరము సేవ చేయగా ॥

506. మంద-మందానిలమ్మంద జేయుచునున్న
విరుల సౌరభములు మరులు గొలుప
విరుల తేనియలాని మురిసి పోయెడి తుమ్మె
దలపాట పడుచు గుండెలను నిలుప
పడుచు గుండియయందు ముడివడ్డ భావనల్
చెఱకు తీయదనంపు జెలిమి గలుప
చెఱకు తీయదనంపు జేవతో జతకట్టు
చిలుక పల్కులు క్రొత్త కులుకు దెలుప
చిలుక తేజిపై, విల్లుగా జెఱకు దాల్చి
యళి గుణమ్మును బిగియించి, యలరుటమ్ము
విసరుచున్నాడు మదనుండు విశ్వమేక
కంఠముగ బల్క సర్వమంగళము-జయము ॥

***

1. భోగ త్యాగములందున
భోగమునకు బెద్దపీట మూర్ఖుడు వేయున్
భోగమును ద్రోసిరాజని
త్యాగమునకు బెద్దపీట ధన్యుడు వేయున్ ॥

2. పసి బిడ్డను గాపాడగ
నసువుల విడనాడు జిలుక త్యాగము కథయై
రసవత్ప్రబంధమైనది
రసమే దైవతము రసిక రాజ్యమునేలున్ ॥

3. కడిమి గలయట్టి కడిమిళ్ళ కలమునుండి
వెలికి వచ్చిన పెంపుడు చిలుక గాథ
మంచి కైతలనెంచి, మన్నించు వారి
గుండియలనుండి వెలికి రాకుండుగాత ॥

4. నా వదనమ్ము కావ్య సదనమ్ము, రసమ్మట బాకశాల, స
ద్భావనలే గదుల్, నుడులు ద్వారములార్ద్ర గభీర తత్త్వమే
బావి, పవిత్ర శాస్త్రముల వాకిట బద్యము రంగవల్లియై
పావనులైన వారలకు స్వాగతముల్ వచియించునెప్పుడున్ ॥

ఇది కౌండిన్య సగోత్రుండును, కడిమిళ్ళాన్వయ సంజాతుండును, బుచ్చమాంబా శేషయాఖ్యుల పౌత్రుండును, భారతీ వేంకట రామయ్య శాస్త్రి దంపతుల పుత్రుండునగు వరప్రసాద సహస్రావధాని ప్రణీతంబైన "పెంపుడు చిలుక" పద్య ప్రబంధము సర్వమ్ము సమాప్తము

***



పద్యమ్మునెవడురా! పాతిపెట్టెదనంచు
ఉన్మాదియై ప్రేలుచున్నవాడు
పద్యమ్మునెవడురా! ప్రాతవడ్డదియంచు
వెఱ్ఱివాడై విఱ్ఱవీగువాడు
పద్యమ్ము ఫలమురా! పాతిపెట్టిన బెద్ద
వృక్షమై పండ్ల వేవేలనొసగు
పద్యమ్మునెప్పుడో పాతిపెట్టితిమేము
లోకుల హృదయాల లోతులందు

ఇప్పుడద్దాని బెకలింపనెవరి తరము
వెలికి తీసి, పాతుట యెంత వెఱ్ఱితనము
నిన్నటికి మున్ను మొన్ననే కన్ను దెఱచు
బాల్యచాపల్యమునకెంత వదఱు తనము

డా॥ కడిమిళ్ళ



పెంపుడు చిలుక డా॥ కడిమిళ్ళ